# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

జూలై 1958

సంపుటము ౩౫ : : సంచిక 7

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## జూలై 1958

# దీపాంగన

శ్రీ దాశరథి

దీపశిఖ నిల్చినది పురంధ్రీ లలాట
పట్టి దీర్చిన కుంకుమ బొట్టు వోలె,
దీప శిఖ పిల్చినది, చనుదెంచినాను
తనువు తనువెల్ల ఆజ్యపాత్రమ్ము వోలె

ఎరకలు వచ్చె నా యెడద కిప్పుడు, దీపకుమారికా భుజాం
బరమున తేలియాడెదను పాడెద, మంచులు పేరినట్టి ఈ
ధరణి జడత్వమూడ్చుటకు తాపము పెంచెద, వేడిలేని ఈ
పరిసరముల్ కవోష్ణరసవారిధిలో నెసలాడజేసెదఁ

నాకుఁ దీపశిఖాకుమారికకు ఈ నాడా ! శతాబ్దాల ముం
దే కానుండెను పెండ్లి ! కాని పవనద్వేషమ్ము దీపానకుఁ
నాకుఁ మధ్య నఖాతముల్ నిలిపె, నైనన్ దాని చేలాంచలం
బాకంపించె మదీయ శీర్షమున ప్రేమామోద సంవాహమై

కలభమ నైన నన్ శరభ సామజ సింహ బలంబులిచ్చి ది
వ్వెల దొరసాని పెంచినది, ప్రేముడితో ముడివేసి వాన గా
డ్పుల తొలిదాడినాడు నను బ్రోచిన, దెంతటి రాగబంధమో !
చలి యన లేదు దీపక భుజా భుజగీ పరిరంభణమ్మునన్ . .

బందీయయ్యె జగమ్ము దీపకళికా ప్రత్యగ్ర బాహా యుగం
బందుఁ నా యెదవోలె, అంధ తమస వ్యాధూత కోకారి వ
చ్చిందా బంధుర లోకమున్ విడచి మద్దీపాంగనా లింగ నా
నంద స్పందన మెక్కి రివ్వుమని పోనా స్వర్గమార్గమ్ములన్ !

ప్రతి యింట నొక చిన్ని ప్రమిద వెల్గించిన
అవిరళస్నేహ రాజ్యాధిరాజ్ఞి,
ప్రతిగుండె నొక ప్రభాప్రతిమ నిర్మించిన
కల్పనా నల్ప శృంగార ధాత్రి
ప్రతి తోటలో నవప్రసవమై నిచ్చిన
కాంతార కాంత వాసంత లక్ష్మి.
ప్రతి మానవీ ముఖాంబరమందు ప్రాకిన
గోరోచనా చంద్ర చారు మూర్తి.

దీపభామిని, ఆశాతిదీప్త కీర్తి,
మంచు కరగించి, వేడికల్పించి, వాగ్వి
పంచి నవరించి వాయించి ప్రకృతి నెల్ల
మూర్ఛ తేరిచి చేతనాంబుధిని దేల్చె!

కాలిన రెక్కలన్ పులుగుకై పడి నీపద కంజ సన్నిధిన్
వ్రాలితి. నిన్ను మ్రింగుటకు వచ్చిన గాడుపు దుండగీనితో
ఆలము సేసి గెల్పుగొనునప్పుడు రెక్కలు కాలిపోయె నీ
జ్వాలలు సోకి; నీకొరకు ప్రాణములైన పణమ్ము వెట్టెదన్

నీలో తేజము తగ్గిపోవునెడ నందింతున్ కవోష్ణాస్రమున్
తైలంబట్టుల — అశ్రుధారలను సంతప్తాజ్యధారం బలెన్,
జ్వాలా చేల విలోల తావక వపుర్వల్లీ విలాసంబుతో
భూలోకంబును సొంత మొక్కత్రుటి సమ్మోహింపగా జేతువే!

నన్ను స్నేహము చేసికొన్నావు నీవు
వెల్గుచున్నావు నామనః పీఠి పైన
ప్రతి రుధిర బిందువును సమర్పణ మొనర్చి
నిన్ను వెల్గించుటకు మరణింతు నేను!

# దీపాంగన

నీ కీలా పరిచుంబితంబయిన నా స్నిగ్ధా ధరోష్ఠమ్ముపై
ప్రాకేళా కమ్మదనాలు ద్రాక్షరసమై, ప్రత్యగ్ర మాధ్వీకమై;
లోకాతీత సుఖమ్ము కూర్చినవి నీ రోచిష్ణు బాహాయుగ
ప్రాకారాంతర జృంభమాణ లికుచాభస్వర్ణ వక్షోజముల్

వెలుతురు మొగ్గవై బ్రతుకు వీథుల నూత్న పరీమళమ్ములన్
జిలికిన నీకుగాను విరచించితి గుండియ కొండమీద ది
వ్వెల రతనాలమేడ, పదవే అటనుండువుగాని, కోటి గుం
డెల వెలిగింప గల్గు రమణిన్ నిను గాడుపు పాలొనర్తునే

నీ నృతి జూచి లోకము ఖణిల్లను గజ్జెలతో నటింపగా
బూనెను, జారిపోయినది పో భవదంసగతాంబరాంచల
శ్రేణి, కటీపటంబు శిథిలీకృతమయ్యె, వివస్త్రవైతివే
రాణి! రవీంద్రకల్పిత విలాసిని ఊర్వశివోలె, దీపికా!

నిను కౌగింటను గొన్న నా తనువు పోనేపోవుగానీ భవత్
తను తేజః పరిణాహ పింజరితమీ ధాత్రీతలంబెల్ల ఆ
త్మనుగా జేసి వసింతు సప్తజగతీ మధ్యమ్మునన్ దీప భా
మిని ప్రేమించిన దీప్తిమంతుడనుగా మిన్నెక్కి క్రీడించుచున్

# హారవిలాసము: కుమారగిరి

శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి

శ్రీనాథుఁడు తన కృతులలో నేదియో యొక రీతిని ప్రసక్తిని గల్పించుకొని రెడ్డిరాజుల ప్రాభవము నభివర్ణించుచు వచ్చినాఁడు. ఏ ప్రబంధమునందే విషయమును వర్ణించినను నది చారిత్రక ప్రమాణము చే బలపడుననుటయే యగును. సమకాలిక శాసనదానములు వాని కుపోద్బలకములై వెలయుచుండును. హరవిలాస కృతి భర్త కాంచీపుర వాసియైన యవచితిప్పయసెట్టి అతఁడు శ్రీనాథునకు బాల్యసఖుఁడు కొండవీటి రెడ్డి రాజులతో వాణిజ్య సంబంధ మేర్పఱచుకొని, వైభవ ప్రాభవముల వహించి వన్నె కెక్కినవాఁడు కావున శ్రీ కొండవీటిలో పెదకోమటి వేముని సామ్రాజ్య మంత రించిన తరువాత, శ్రీనాథునకుఁ గృతిభర్తగా, శివ భక్తుఁడు, కుమారగిర్యధీశలబ్ధ రాజలాంఛనుఁడు, మహా విభవ సంపన్నుఁడు నగు అవచి తిప్పయ్యసెట్టి గాన వచ్చినాఁడు ఈవిషయమును శ్రీనాథుఁడు హరవిలా సము కృత్యాదియం దిట్లు తెలిపియున్నాఁడు

వ. "శ్రీత్రిపురాంతక దేవ దివ్య శ్రీపాద పద్మారాధ కుండును, వశీకృత నిఖిల భూభుజుండును, పతిత త్యాగ ధ్వజుండును, నిర్మల కులశీలుండును, గవి జన స్తోత్రపాత్రుండును నగుచు, జంబూ ద్వీప భూ భువనమండలీ మకుట మండనాయమానంబగు కాంచీ పురంబు రాజధానిగాఁ గీర్తి లతాధిష్ఠి తాష్టాదశ ద్వీపాంతరం బుండు కొమరగిరి వసంత నృపాలునివలన కాందోళికా ఛత్ర చామర తురంగ భద్రపీఠాది రాజ్య చిహ్నంబులు వడసి, యమ్మహారాజునకుఁ బ్రతివత్స రంబును వసంతోత్సవంబులకుం దగిన కస్తూరీ కుంకుమ ఘనసార సంకుమద హిమాంబు కాలాగరు గంధసార ప్రధానంబులగు సుగంధ ద్రవ్యంబు లొడఁగూర్చియు, జీని సింహళ తవాయి హురుముంజి జోణంగి ప్రభృతి నానా ద్వీప నగరా కరంబులకు ధనకనక వస్తువాహన మాణిక్య గాణిక్యం బులఁ దెప్పించియుఁ, గవి గమకి వాది వాంశిక వైతాళి కాదులగు నర్థిజనంబులకు నర్థంబులు గుప్పించియు, ధీగుంభన మదాగుంభన గంభీరుండును సదాచారుండును భువన విఖ్యాతి గైకొను నవచితిప్ప ప్రభుండు"

ఈ వర్ణనమున మనకెన్నియో విషయములు విది తములగుచున్నవి. అవచి తిప్పయ యొకండే శెట్టిశ్రేష్ఠుఁడు ఉదారుఁడు కవిజన కల్పకము. ఇయ్యది మొదటి విష యము. ఆ వెనుక కొండవీటి పాలకుఁడైన వసంతరాజ బిరుదాంకితుఁడగు కుమారగిరివలన రాజచిహ్నములు బడసిన మేటి కిరాటుఁడని తెలియవచ్చుచున్నది. కుమారగిరి ప్రతివత్సరము వసంతోత్సవములను జెఱుపు చుండెడి వాఁడనియు, ఆ యుత్సవములకు వలయు కస్తూరీ కర్పూర గంధసారాది సుగంధ ద్రవ్యములను ద్వీపాంతరములనుండి రావించి, యొడఁ గూర్చు చుండెడి వాఁడనియు, తిన్నఁగ కుమారగిరితో నవచి తిప్పయకు వ్యాపారిక సంబంధము ఘనిష్ఠ మయ్యెననియు, ఆ నాఁటి యాంధ్రుల నౌకా వ్యాపారము చీని సింహళాది ద్వీపాంతరములతోఁ గొనసాగు చుండెననియు విదితమగుచున్నది. అవచి తిప్పయ కళాప్రియుఁడనియు నర్థిజనుల కర్థములు గుప్పించు వాఁడనియుఁ దెలియుచున్నది.

అవచితిప్పయసెట్టి కుమారగిరి కెట్లు ప్రతి సంవ త్సర వసంతోత్సవముల కే యే ద్వీపములనుండి యే యే సుగంధ ద్రవ్యములను గొనివచ్చుచుండెడి వాఁడో, ఆ నాఁటియే యోడలు నౌకా వ్యాపారమునందుప యోగపడుచుండెడివో వాని నీ కృత్యాదియందే శ్రీనా థుఁడు తెలిపియున్నాఁడు

సీ. పంజారఁ గర్పూర పాదపంబులఁ దెచ్చె
జలనోంగి బంగారు మొలకఁ దెచ్చె
సింహళంబున గంధసింధురంబులఁ దెచ్చె
హురుమంజి బలుతేజి హరులఁ దెచ్చె
గోవ సంశుద్ధ సంకు మద ద్రవము దెచ్చె
యాంపఁ గట్టాణి ముత్యాలు దెచ్చె
బోటఁ గస్తూరికా పుట కోశములు దెచ్చెఁ
జీనిఁ జీనాంబర శ్రేణిఁ దెచ్చె

నుంచే మరణించాను. అమ్మాయికు తల్లి లేదు. అలా జరిగిన మరునాడే అమ్మాయి వాళ్ళ తమ్ముణ్ణి తీసుకొని వాళ్ళమ్మమ్మ తన యింటికి కాకినాడ వెళ్ళిపోయింది

నాలో తుపాను చెలరేగింది. మనసులో పడివున్న మమతలు బయటపడసాగాయి. అమ్మాయిని చూసి తీవ్ర పోరాటంలో నా హృదయంలోని ముగ్ధవాంఛా పూరిత పరిశీలనంతా గందరగోళమున్నగా మారిపోయింది. ప్రపంచమంతా చీకటిగా తోచింది. పాతికేళ్ళుండి పిన్న పెద్దలతో కలకటానికి మా చిన్నాన్నగారింట్లో నేను భరింపగాని ఒంటరితనంతో బాధ పడేవాణ్ని! నా హృదయంలో వాంఛాగ్నులు రెండూ ఒకేసారి గంగాయమునల్లాగ కలిసి పెనవేసుకొని మథింప జొచ్చాయి" అని నిట్టూర్చి ఆపుచేశాడు శేషగిరి

"ఇంతకూ నువ్వు కథ చెప్తున్నావా కవిత్వం చెప్తున్నావా?"

"ఆనాటి నా హృదయంలోని బాధ అర్థమయ్యేటట్లు వివరించాలంటే భాష దొరకటంలేదు రమణా! నేను వాడిన పదాలు నా భావము ముందు చాలా పేలవాలు"

"సరే తర్వాత కథ కానీయ్" అన్న రమణ మాటలతో తిరిగి చెప్పసాగాడు శేషగిరి

"ఆ జ్ఞాపకాలతోనే తర్వాత సంవత్సరం కూడా గడిపాను. ఆ సంవత్సరంలో ఒక్కసారయినా అమ్మాయిని చూడలేకపోయాను. కనీసం ఆమె దగ్గరనుంచి ఉత్తరమైనా రాలేదు. నేనూ వ్రాయలేదు. మార్కులు ఫైనలు పరీక్షలు బాగానే వ్రాశాను. సెలవుల్లో కూడా స్వగ్రామం వెళ్ళకుండా అక్కడే వుండి హిందీ చదువుతున్నాను. నా హృదయానికి నిజమైన వసంత ఋతులక్షణాలు లభ్యతే పాడైపోయాయి. మా యింటి యెదురుగా వున్న వారమ్మాయి పెళ్ళికి వాళ్ళమ్మట్టా లొచ్చారు. మా వాళ్ళింటివాళ్ళతోబాటు నేనూ వెళ్ళాను. పెళ్ళికి పెళ్ళికొడుకు తాళికట్టే ఆ సుముహూర్తములో అప్రయత్నముగా పేరంటాళ్ళలో నిలుచున్న ఓ అమ్మాయివంక చూశాను. అప్పటికే ఆ అమ్మాయి నావంక చూస్తూవుంది. "ఆగండోయ్ భజంత్రీలు" అని పురోహితుడు అరిచేవరకూ మేమలా ఒకరినొకరు చూసుకొంటూనే వున్నాం. పెళ్ళయిపోయిన పది రోజులవరకూ ఆ అమ్మాయి అక్కడే వుంది. ఆ పది రోజులలో మా పరిచయం రహస్య సమావేశాలవరకు వచ్చింది. ఒకనాటి సంధ్యాసమయంలో లక్ష్మితో నేను "పెళ్ళంటూ చేసుకొంటే నిన్నుతప్ప మరెవ్వరినీ చేసుకోను" అని ప్రమాణం చేశాను. ఆమె చటుక్కున వంగి నా పాదాలకు నమస్కరించింది

"ఆ అమ్మాయి పేరు లక్ష్మా?"

"అవును. అసలు పేరు చాల పెద్దది. అందు కంచేనూ చివరనున్న లక్ష్మి అనే పిలిచేవారు నేనూ అంతే"

"ఊఁ తర్వాత"

"నాలో పరవళ్ళుతొక్కే ప్రేమప్రవాహం అంతా ఆమె పాదాలదగ్గరకు ప్రవహించింది. మా రహస్య సమావేశాలు ఎలాగో బయటకు పొక్కాయి. పెద్దలదాకా పాకాయి. మా చిన్నాన్న నన్ను పన్నగా మందలించాడు. ఆరాత్రి వల్లే తమ్ముడు కృష్ణారావుచేత చీటి పంపించింది లక్ష్మి ఒక్కసారి మాట్లాడమని. ఆ మరునాడే తను యింటికి వెళ్ళిపోతూ వుందట. అమావాస్యనాగానే మా పెరటిలో పనసచెట్టు అవతల గడ్డిమేటి ప్రక్క మహాభాగ్యవతి లక్ష్మి రాకకోసం యెదురుచూస్తున్నాను. "పాలిపోయిన బుగ్గలమీద కన్నీళ్ళు చారలుకట్టి ప్రవహిస్తుంటే, ముడివిడిన జుట్టు మూపుమీద చిందరవందరగా పడివుండగా కొడిగట్టిన లైటు పట్టుకొనివచ్చి, నీళ్ళు నిండిన కళ్ళతో నావంక చూస్తూ చటుక్కున నా కాళ్ళకు నమస్కరించింది. ఆమె సౌందర్యం యెలాంటో నాకు తెలియలేదు. సంగతులన్నీ చెప్పింది. మా ప్రణయగాథ బయట పడినందువల్లనే తనను బలవంతంగా పంపించేస్తున్నారట! మేమలా మాట్లాడుతూవుండగానే ఎవరో ముసలమ్మ వచ్చి లక్ష్మిని రెక్కపట్టుకొని లాక్కుపోయింది. అప్పటినుంచి యిప్పటివరకూ లక్ష్మి నాకు కనిపించనేలేదు

"లక్ష్మిని పెళ్ళాడటానికి మీవాళ్ళు అంగీకరించలేదా?"

"లేదు"

"ఎందుకనీ?"

"వాళ్ళిద్దర్నీ జాతిగాదట! వ్యభిచారిట! ఆసంబంధం మాకు సరికాదట"

"లక్ష్మికి పెళ్ళయిందా?"

"అయిందట"

# కరుణాలహరి

శ్రీ బూర్గుల రామకృష్ణరావు

దేవ! విషాదభూమి బహుతీవ్ర విషానల మూలమౌర నా
నా విషయ వ్యథోగ్ర తిమి నక్ర ఝషాకుల మీ భవాబ్ధిలో
నావ యొకింత గన్పడ కనారతముం బడి కొట్టుకొందు దుః
ఖావధి గాన నీకిదె మదాత్మ సమర్పణ మందుకోఁగదే

భవభయదాగ్ని కీలలకుఁ బ్రాణము తావులు దప్పె, భీతిచే
భవ దరుణాంఘ్రి పంకజము పాయక దిక్కని పట్టుకొంటి నే
నవిరతమున్, దయారస సుధాబ్ధివి గావున పథ్యమేది యే
దవునను కొందువో యది దయన్ ఘటియింపవె నాకు శ్రీ హరీ!

అరయగ నేక దేహముల నల్లిక పెట్టి మరీచికావళిన్
దొరయు మహా మరుస్థలిగఁ దోచు ప్రపంచ మెఱింగి వీడి యో
మురహర! నీ దయామృత సముద్రములోఁ బడి యోలలాడగా
దొరకొని నామనో మృగము దూకుచు నూరక చెంగలించెన్

నీ పదపుల్లపంకజ వినిర్మల దివ్యమరంద పాన లీ
లా పరతంత్రతన్ బరమలంపటమైన మనోమిళింద మో
శ్రీ పరమేశ! చాపల మశేషమునున్ విడనాడి, నిన్ వినా
యే పరదైవమేని నిరసించి తృణంబని యెంచుఁగాంచితే.

ఏనరు లీ జగత్త్రయము నెల్లవిధమ్ముల నేలఁ గంకణ
మ్మూనిన నిన్ను, నీ చరణ యుగ్మముఁ గాదని త్రోసివైచి, యే
కోనన్ నొ చేరుదిక్కు గనుగో వెదుకం జనువారొ, వార లీ
శాన! కృతాంత దుర్దమ నిశాంత కవాటము తట్టరే హరీ!

లలిత రమా ముఖాంబుజ విలాస వికాసన పూర్ణ దక్షతన్
బొలిచి జగత్త్రయీ జన విబోధ విధాన నిదాన దీక్షులై
నలఘు త్వదీయ దివ్యనయనారుణ రేఖలు బాలువారి తా
మెలమి హరించు టెన్నఁడొ కదే మదబోధ విభావరిన్ హరీ!

నిరతి సురాసుర ప్రకర నిస్తుల చిత్త చకోర చుంబిత
స్మరయ సమస్తసాధు జనశాఖల తాపచయాప నోద నా
దరమగు నీ ముఖమ్మను సుధానిధిఁ జాల్కొను పండువెన్నెలల్
విరిసి మదీయ మానవ మలీమస దుర్నిశిఁ దోచు టెన్నఁడో.

నిండగు యౌవనమ్మున వినిర్మల పాండుర గండమండలిన్
మండిత చండ దీధితి కనన్మణి కుండల తాండవమ్ములన్
బందువు సేయు నీ వదన పంకజ మచ్యుత! ముద్దుగుల్క మా
దండను దోచి కందొవకుఁ డానొక నిండగు టెన్నఁడో ప్రభూ!

గంగా తుంగ తరంగ భంగిమను జక్కన్ దూగి దేవాసురా
భంగ శ్రీక లలాట లాలితము నై త్వత్పాద పంకేరుహా
సంగమ్మైన పరాగపుంజమది యాశా! యుత్తమాంగాన నే
సింగారించు టదెప్పుడో కద దయాసింధూ! జగద్బాంధవా

దేవ! మదింద్రియాశ్వములు ద్రెంచుకొనెన్ మదమేచి, త్రెంచి పా
శావళి నా వివేకమును నట్టి దరూ! యురికెన్ జవమ్మునన్,
దావక పాద మందురనుఁ దారిచి త్వద్గుణబంధనమ్ము నం
దీవ బిగింపు తండ్రి! వహియించు నొకించుక సాధుభావమున్

పతివై సర్వపురాణ వాగ్వితతికిం బట్టంగ రానట్టి స
ద్గతి యా శ్రీ పురుషోత్తమున్ విడిచి నిన్ గల్యాణమూర్తిన్ మహా
పతియా నామది సిగ్గుపీడి పరమేశా! యింక నెవ్వారి నం
గతి నాసించును దెల్పవే పరమ మాంగళ్యాకృతీ! శ్రీపతీ!

నీదు కృపాలవం బదియ నేను వరించితి, నంత మీఁద నిం
కేదియు స్వప్న జాగృతుల నెన్నఁడు గోరనలేదు నిక్క, మీ
నాదు నివేదన మ్మొగి మనమ్మునఁ దాత్త్వికమంచుఁ దట్టినా
వేద విధేయ! కాదనక వేగమ నన్ను బరిగ్రహింపుమా!

ఆపదను వన్నరౌ! విడిచి రందరు చూచితె యిప్పుడో దయా
వనధీ! యొకింత నాదు దురవస్థ గనుంగొనరాదె, యింక నై
నను నను జెట్టవట్టి యొకనాడయినన్ మతివేగ లేవ? వే
డిన వినరాదు, రా కటిక డెందము చాఁత విపైతి వేలరా?

# కరుణాలహరి

అతి భరమైన యీ జగము నంతయుఁ బూనెదు, జీవకోటి బల్
ధృతి భరియింతు, నీకు బరు వింతకు శోచన లేద, జీవ సం
తతిఁ బరమాణువైన నను దండ్రి! భరింపగ భారమౌనె? నా
గతి యెవరింక నాప్త జన కల్పక! నీవ యుపేక్ష సేసినన్

పరిపూర్ణమ్మగు భక్తియున్ వినయమున్ బాలించి ప్రశ్నించెదన్,
సరిగా నారసి యుత్తరమ్మొసఁగుమా, సత్యమ్మదెట్లున్నదో,
త్వరగా నన్ను సముద్ధరించుటకు నాటంకమ్ము లేమున్నె? వా
కిరి కన్నన్ గిరికన్న నేను బరువై కాన్పింతునే, మాధవా!

ధనములు వేడ, రాజ్యసుఖ దర్పము లక్కఱ లేదు విద్య లి
మ్మనను గృపాతరంగిత నిరర్గళ మంగళ భావభంగిమ
మ్మనితర వస్తు సుందర మహాంగరుచిం గనుగొన్నఁ జాలు నీ
వనయము నాదు వంకఁ, గమలాక్ష! యిదొక్కటె నిన్ను వేడెదన్!

పేఁదరి నీచుఁడుం ఖలుఁ డపేతగుణుం డధమాధముండు, నా
వాఁడని యాదరింపఁ దగువాఁడు దయానిధివైన నీకుఁ, దా
నేక విషమ్ము గ్రక్కు ఫణులేడ యడైనను జందనమ్ము గా
పాడుట లేదె నీడయయి వాని నమంద ముదమ్మునందగన్.

ఆకలి దాహ కోర్కెల మహాగ్ని సిగ్గనుమాట మాటకున్
లేకయ బాటలందుఁ గణలేశము లబ్బినచోట మెక్కుచున్
దేకువ దప్పితిన్, హరి! త్వదీయుఁడు కింకరుఁ డన్యుఁ జేరి యా
వాకిటఁ గుక్కయాట యది వాసియె నీ కకలంక! చెప్పుమా!

నరకమునందుఁ గూలుదునొ నాకటఁ బోయెడిదేమి? సిగ్గు లే
కరకె చరించు నిన్నరుని కా తలవంపు లనాథ నాథ! యో
నరహరి నీకె చూచుకొను, నాపయి నీదు కటాక్ష ముంపవా
కరమున నెత్తి చూపెదరు గాదె నినున్ జనమాడి పోయుచున్.

నరకమునందు బాధల ననారత మేను భరింతు నెట్టులో
మురహర! నా వ్యకర్మగతి మూలముటంచటొ తొర్మివట్టి, యీ
వరణి నిదొక్కటే హృదయశల్యము నన్గని యొల్లవారు పేఁ
డరటె! యనాథుఁడంచ నెదరయ్య ప్రభూ! పలుగాకి లోకముల్.

సశేషం.

# పంపకవి

శ్రీ కె. సుబ్బరామప్ప

తెలుగు కన్నడ సాహిత్యముల సాంనిహిత్యమును గూర్చి మేనెల భారతిలో ప్రకటింపబడిన 16 వ శతాబ్దముతనుకు తెలుగు కన్నడ సాహిత్యముల పరస్పర సంబంధము నందులో వివరించితిని. ఈ వ్యాసమున కన్నడిగుల ఆదికవియైన పంపకవిని గూర్చి తెలుగువారికి పరిచయము గావింప దలచితిని.

కన్నడ సాహిత్యమున మేటికవులు పంప, రన్న, పొన్న అనువారు. వీరిని రత్నత్రయ మందురు. తెనుగు సాహిత్యమున కవిత్రయమువంటివారు వీరు. కన్నడ సాహిత్యమున 9 వ శతాబ్దమున నృపతుంగుడు "కవిరాజమార్గ"మను గ్రంథమును వ్రాసినను, అది లక్షణ గ్రంథమగుటచే 10 వ శతాబ్దమున కావ్యమువ్రాసిన పంపకవియే కన్నడిగుల ఆదికవియని ప్రసిద్ధి వచ్చెను.

పంపకవి ఆంధ్రదేశముతో సంబంధము కలవాడు. ఆంధ్రభాషతోను సంప్రదాయములతోను వీనికి పరిచయము గలదు. శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు తమ సాహిత్యచరిత్రలో పంపకవి తెనుగునందుకూడ కవిత్వము వ్రాసినట్లు కొన్ని పద్యముల నుదాహరించియున్నారు. తెలుగువారికి నన్నయభట్టారకు డెట్లో కన్నడిగులకు పంపకవియు నట్టివాడు.

ఆనాడు మతము నాశ్రయించుకొని సాహిత్య మభివృద్ధి జెందినది. కన్నడ సాహిత్యము జైనయుగ, వీరశైవయుగ, బ్రాహ్మణయుగ అని విభజించి చెప్పబడినది. అనగా సాహిత్యముపై మతములకట్టి ప్రభావము గలదో వ్యక్తమగుచు. పంపకవి సదాచార సంపన్నులైన బ్రాహ్మణ వైదిక కుటుంబమునకు జెందినవాడు. జైన మతావలంబి యయ్యెను. ఆంధ్ర దేశమున నాడు విజృంభించుచున్న వైదికమతము గిట్టక కన్నడ నాడునకు విచ్చేసి యుండెనో? అటులనే వైదిక కన్నడిగుడైన నారాయణభట్టు కన్నడ దేశమున 10, 11 శతాబ్దాలలో విజృంభించుచున్న జైనమతము పరిపడక కాబోలు ఆంధ్రదేశమునకు వచ్చి రాజరాజ నరేంద్రుని ఆస్థానమును జేరి నన్నయ్యకు భారత రచనలో సహాయపడెను. పంపకవి ముత్తాత తండ్రియైన మాధవ సోమయాజి మంత్రసిద్ధినిపొంది యజ్ఞయాగాదికముల నాచరించి ప్రసిద్ధికెక్కినవాడు. ఈతనిమహిమ చేత వంశమునకు గౌరవము. కాని అతని యాగధూమము నుండి జైనమతావలంబియైన తన కీర్తికి కాలుష్యము గలదని బహుశః పంపడు వ్యసనపడియుండును. ఈ మాధవ సోమయాజి సంతతిలోని అభిరామదేవుడే పంపని తండ్రి. పంపకవికి అనూచానముగ వచ్చిన బ్రాహ్మణ సాంప్రదాయముతో క్రొత్తగ నైకొన్న జైనధర్మము గూడ కలిసికొని రెండును పాలును నీరువలె కలిసి పోయినవే గాని ఒకదానితో నొకటి ఘర్షించలేదు. మతాంతరుడైనను నీతనియందు మతాంధత యూపలేదు. పంపనియందు రెండు సంస్కారముల సారమును జేరి కొని పుష్టినొందెను ఉదారమయ్యెను. దీని ఫలితము అతని కవిత్వమున కానవచ్చును.

పంపని వంశీయులు వేంగిమండలములోని వేంగిపఱ్ఱు అను అగ్రహారమున నుండినవారు. వేగినాడు కృష్ణాగోదావరీనదుల మధ్యగల ప్రాంతము. ఇది ఆంధ్రదేశమైనను అక్కడ కూడ కొందరు కన్నడిగులు నివసించుచుండిరని గోచరమగుచున్నది. నృపతుంగుడు తన "కవిరాజమార్గమున" (9 వ, శతాబ్దము) కన్నడదేశ విస్తరమును వివరించుచు "కావేరి ఇంద గోదావరి వరెం" (కావేరినుండి గోదావరి వఱకు అని) చెప్పియున్నాడు. పంపకవి పెద్దవాడై గొప్పకవి అగు సమయమునకు వేంగిమండలమునకు పశ్చిమమున నుండు కన్నడ నాడునకు సమీపమున గల వేములవాడ యందు రాజ్యము చేయుచున్న అరికేసరి ఆస్థానమును జేరెను. ఈ ప్రభువుయొక్క ఆశ్రయమున కావ్యరచనగావించి పూజాపురస్కార లాభములను పొందెను ("పూజాసత్కార లాభంగళు") పిమ్మట నితడు కన్నడదేశమున మలెనాడు ప్రాంతమున సంచరించి అందలి ప్రకృతి రామణీయకమునకు అచ్చెరువంది తన కావ్యమునందు దానిని సొగసుగ వర్ణించెను.

ము "ఉపమాతీతమని" పొగడెను. ఈతని కృతులు కన్నడ సాహిత్యమున కొక క్రొత్త యుగమును సృష్టించెను. జైనయుగమనుటకు మారుగ పంపయుగమనుటయే యోగ్యము సంపూర్ణదశలో ప్రవేశించకపోయినను, వారు జైనులు కానీ, కాకపోనీ, క్రీ. శ. 1200 వరకు పంపకవి కావ్యములే ఆదర్శములైనవి. ఆదిపురాణమున గద్య పద్యములలో దీర్ఘములైన సంస్కృత సమాసములు కొంచెము కొన్ని పద్యములలో పాదాంత్యములందలి కన్నడ ప్రత్యయములను తొలగించిన యెడల కేవల సంస్కృత రచనయేనా యనిపించును. ఈతని రచన "లలితపద" భూయిష్ఠమై "ప్రసన్న కవితాగుణము"లతో నొప్పినది "అక్షర రమ్యత"గలదు. పంపని రచనలోని యీగుణములనే మన నన్నయ్య అనుకరించెను.

భారతము రచించువేళకు ఈతనిలో సంస్కృతముపై కొంత మోజుతగ్గినది. అచ్చకన్నడ నుడులను అనేకచోట్ల వాడుచువచ్చెను. లోకానుభవము కూడ అప్పటికి అతిశయించినది. పరిణామైక్యము కవి మాహాత్మ్యదృష్టిని తెలియజేయును. యుద్ధవర్ణనలలో నీతినియమానుకూల్య ముండెను. అతడు స్వయముగ వీరుడు రణరంగమున జొరబడి అక్కడి సన్నివేశములను, విన్యాసములను కన్నార గాంచినాడు అందువల్లనే యీతని యుద్ధవర్ణనలన్నియు స్వభావోక్తులు. ఇతడు "ప్రసన్నకథా" కథనమందు దక్షుడు. కొంతను—సత్యవతి సందర్శనము, కర్ణజననము, కుంతీ కర్ణ సంభాషణము, శతశృంగ పర్వతమున పాండురాజ కథ మొదలైనవి ఇందుల కుదాహరణములు

నవీన కల్పన, రసానుగుణమైన కథాశరీర రచన, వస్తువునకు తగు రసనిర్మాణము, రసమునకు తగినట్లు ఛందస్సును వాడుట, కావ్యసౌందర్యము చెడనీయక అంగోపాంగములను వర్ణించుట, పంపని రచనంగు కావలసినను అతడు పాత్రలకు జీవమిచ్చి యెదుట నిల్చి మాట్లాడునట్లు చేయును సహజముగ వర్ణించును. సన్నివేశమునకు తగినట్లు మితిమీరక కథను నడిపించును. బహువిధప్రయోగ దక్షతను చూపును సముద్రయములను విరివిగా వాడుట ఇతనికి ఇష్టము "సాహిత్యమిత మృదువచన," "ప్రసన్న గంభీర రచన చతుర," "శబ్దాలం కారగర్భం, మృదుపదసందర్భం, విచారక్షమం, ఉచితపదం, శ్రవ్యం" అని తన కావ్యగుణములను గూర్చి నిరూపించుకొన్నాడు "లలిత పదం" "ప్రసన్న కవితాగుణం," "అక్షర రమ్యత"—వీనినిగూర్చి కూడ చెప్పికొన్నాడు

పంపకవి మహాభారతమందలి యొక అల్పమైన భీమదుర్యోధనుల గదాయుద్ధ కథను రన్నకవి "గదాయుద్ధ" అను గొప్ప కావ్యముగా వ్రాసినాడు. పంపని శైలిని మెచ్చుకొని యాతని కొన్ని వాక్యములను చిన్నమార్పులచే తన గ్రంథమున చేర్చికొన్నాడు ఈతని కల్పనా చాతుర్యమున కొక యుదాహరణము

"ఇదఱోళ్ శ్వేతాత పత్ర స్థగిత దశదిశా
మండలం, రాజచక్రం,
పుదిదత్తో డిత్తిసంగిత్తి దటోళ్
కురురాజాన్వయం, మత్ప్రతాప
క్కె దఱిందం నోడకుర్వ్వ ద్విదుదిదువ
మహాభారత క్కాదియాత్తు
ద్ద దశౌక్తి కేశ పాశవ్యమె బగెయ
భవత్కేశ పాశ ప్రపంచం"

ద్రౌపదీ కేశపాశమే ఒక ప్రపంచమైనది దానియందు అనేక రాజాధిరాజులు అడగిపోయిరి కౌరవ వంశమే దానియందు అంత్యమయ్యెను మహాభారత సంగ్రామమునకు అది నాంది అయ్యెను కౌరవుల నుండి ద్రౌపదికి గల్గిన అవమానమే మూలకారణము కదా! ఇది పై పద్యము యొక్క భావము.

## నన్నయ అనుకరణ

పంపకవిని నన్నయభట్టు కొన్ని సందర్భములలో అనుకరించి యున్నాడు తనకు సహాధ్యాయుడును, ఇష్టుడునునైన నారాయణభట్టుచే పంపని రచనా రీతులను, వర్ణనా కౌశల్యమును, 'ప్రసన్న కవితార్థ యుక్తిని', 'అక్షర రమ్యతను' తెలిసికొన్నాడు. అనుకరించవలసిన వానిని అందు కొన్నాడు చాళుక్యులు కన్నడము తెలియనివారు కారు. చాళుక్యులు కన్నడిగులు సంబంధీకులు (చూ. డా. నేలటూరి వెంకటరమణయ్యగారి "వేములవాడ చాళుక్యులు" "భారతి" డిశంబరు 1948) ఒక శతాబ్దమునకు ముందే రచించబడినట్టి పంపభారతము వేంగి రాజ రాజనరేంద్రుని ఆస్థానమున ప్రసిద్ధికెక్కియే యుండును. కన్నడకవి నారాయణభట్టుయొక్క సహాయమునుగూర్చి నన్నయ గ్రంథాదిని గొప్ప ఉపమానము

లతో ప్రకాశించుటనుబట్టి పరికించినచో పంప భారతమును నన్నయయు ఆతడు బాగుగ పరిచయము చేసినాడని తెల్లమగును.

నన్నయ అనుకరించిన పట్టులు కొన్ని మాత్రము సూచింతును.

నన్నయ గ్రంథాదిని వ్రాసిన "సారమతిన్" అను పద్యముతో దీటైనది పంపభారతమున "లలితపదం ప్రసన్న కవితాగుణ" ఇత్యాదితో ప్రారంభమగును. అంకితపద్ధతి, గ్రంథాదిని దేవతా స్తుతము పంపని అనుకరణయే. ఆదిపర్వమున శకుంతలోపాఖ్యానము కణ్వాశ్రమమును దుష్యంతుడు దర్శించినప్పుడు, ఆశ్రమప్రాంతమున వైరి వర్గములు విడి జంతుజాలము అన్యోన్యముగ నుండుటయు, శుకములు వేదపఠనము చేయుచున్నదియు పంపకవి భారతములోనివి. పంప భారతమున పాండురాజు శతశృంగ పర్వతమునకు పోయినప్పుడు అందలి మునాశ్రమము లిట్లుండెనని పంపకవి వర్ణించియున్నాడు.

"మునికుమారరు ఓదువ వేదవేదాంగగళం తిద్దువినుతు జనెదు బగ్గిసువ పచుమరాగళ బల్లవర గిళిగళుమం, సురభిగళ తొరెద కెంజెగళ మున్నాగువ మరిగళం పులిగమోంకి కుంకి కెంజెగళ మున్నాకి కోరెవరి గళుమం, తమ్మొళ్ కెల దాడువ కోంక వరి గళం పిడుదు తెగెదు కరికలభంగళుమం, ఆ గళాగళిందం పాయ్వ పులిగళ మరిగళోళ్ పరిదాడువ తరుణ హరిణంగళుమం తోద్యం పట్టు"

## నన్నయ :

"శ్రీకంఠమునుధ్వనులు గానంబులు
చదివెడి శుకముల చదువు దగిలి
కదలక వినుచుండు కరులును కరికర
శీకరాప్యాయ తప్తశిఖరాంబు .
. . తోద్యమందె"

## కృతిపతి వర్ణన

పంప "శ్రీపతిగ యుద్ధమల్ల మహీపతిగె వెగ్గళిభూష్టి" మొదలైన పద్యాలు

నన్నయ "రాజకులైక భూషణుడు" "విమలాదిత్యగుణాకరుడు" మొదలైన పద్యములతో ఇంచుమించు పోలికలు గలవు

ఛందోనుకరణములు, పద్యముల ఎత్తుగడలు, విభక్తి పల్లటములు, వర్ణనా రీతులు కొన్ని పట్టులలో పంపని అనుకరించినాడు నన్నయ

పంపకవి "కవితా గుణార్ణవ" "సుకవిజన మనో మానస హంస," "సంసార సారోదయ" మొదలైన బిరుదావళిని సంపాదించుకొన్నాడు. ఈకవి ఆది పురాణమును మూడు నెలలోను, విక్రమార్జున విజయమును (భారతమును) ఆరు నెలలోను ముగించు శక్తి మహాకవి యనిపించుకొనుట పూర్వజన్మ సుకృతము ప్రతిభాశాలియగుటకు పుణ్యముచేసి యుండవలెను అటువంటి కవిని బడయుటకు జనులు నోచియుండవలెను ఇటువంటి కవిని బడసిన కన్నడిగులు ధన్యులు.

## ఆధార గ్రంథములు

1 "పంప" శ్రీ తీ. నం. శ్రీకంఠయ్య ఎం.ఏ., (మైసూరు విశ్వవిద్యాలయ ప్రకటన)

2. "కన్నడ సాహిత్య" శ్రీ కె. వెంకటరామప్ప ఎం. ఏ., (మైసూరు విశ్వవిద్యాలయ ప్రకటన)

3 "నాడోజ పంప" శ్రీ ముళియ తిమ్మప్పయ్య (మంగళూరు)

4. కన్నడ సాహిత్యచరిత్ర" శ్రీ రం శ్రీ ముగళి.

# పరీక్ష

శ్రీ ఆర్. యం. చిదంబరం

గంటలు గణగణమని ఒక్కసారి మ్రోగాయి దీపాలవెలుగులో ఆ దివ్యమంగళ గోపురం వెలిగి పోతున్నాది. రకరకాల పువ్వుల సువాసన ఉక్కిరి బిక్కిరి చేసింది. మనసులో ఆకాశపు టంచుల్ని అధిగమించి పైకి లేచిపోతూన్న భావాలు. దూపహారతి మెల ఆ శక్తి స్వరూపిణి కింకిణీ చెంగులకు అలంకారం లేని వాతావరణం రెండు నిమిషాలవరకూ కాచిన తల పైకెత్తి లేదు. మూసినకళ్లు తెరవలేదు. ఏదో వూహాతీతమైన తృప్తి కలిగింది.

నీటి చుక్కలతో తళ్ళు నిండుతున్నట్టున్న ఆ రెండు పువ్వుల్ని కళ్ళకద్దుకుని ఆవరణదాటి బయట కొచ్చాను. సుందరి కంగారుగా నడిచిపోతోంది ఆమె నడకనుబట్టి గుర్తుపట్టాను. ఎదురుగా వస్తున్న మనిషిని ఢీకొట్టింది కూడా—ఒకటి రెండుసార్లు చీర కాళ్ళ కడ్డంపడ్డి ఆమెను తూలా కొట్టేంద గోయింది. గడియారం వంక చూస్తే ఆరుగంటలైంది. అయిగున్నరకే రమణ వచ్చివుండాలి. చప్పట్లు చరిచి పిలవగానే సుందరి ఆగి వెనక్కి తిరిగిచూసి ఏదో తప్పించేసిన దానికిమల్లే వాలిక కొంగుచుక్కుంది. ఒకవేళ ఆమెకళ్ళే నన్ను చూసివుండి కూడా పలకరించ లేదేమో!

'సుందరీ! ఏమిటిది? ఎన్నడూ లేనిది ఇవాళిలా వచ్చావు? రమణ ఇంకా రాలేదా?' అన్నడిగాను.

'ఇంకా రాలేదు. మీరింటికొస్తున్నారుగదా! అక్కడుంటా చెప్పాను' ఆమె కంఠం భయాన్ని తెలియజేస్తూ బాధపడుతూంది. రెండుచుక్కలు తొందరగా ముందుకు వచ్చి ఛలుక్కున ఆగిపోయింది.

'చూడండి! మీరు నాకో సాయం చెయ్యాలి. నేనిలా ఒచ్చినట్టుగా ఆయనతో మాత్రం చెప్పకండి. ఆయనలా ప్రస్తావన ఎత్తేందుకు ప్రళయం తెస్తారు!

మలుపు తిరిగేవరకూ ఆమె ఎంత వేగంతో పోతున్నాదీ నేను గమనించగలిగాను. సుందరి రమణను చూసి ఎందుకు జడుసుకొంటోందో నాకు తెలుసు. ఆ కారణం తల్చుకుంటే ఆపుకోలేని నవ్వొచ్చింది

రమణ ఇల్లు చేరుకునే సరికి మరో పది నిముషాలు పట్టింది.

'ఎవరది?' అంటూ రామయ్యగారు కళ్ళమీద అరచేయి వుంచుకుని నేనెవర్నో కనుక్కుందికి ప్రయత్నించారు.

'నేనండీ! రాంబాబుని' అని వాక్యం పూర్తిచేయటం, సుందరి వంటింట్లోనుంచి పొగలు కక్కుతూన్న కాఫీని నాముందర వుంచటం ఒక్కసారే జరిగాయి నేననుకున్నది సరైనదే—రమణ ఇంకా ఇంటికి రాలేదు

'అదృష్టవంతుడా!. ఎంత దగ్గరగా వున్నా కనపడటం లేదు మనిషి. ఏ అవయవం లేకపోయినా ఎలాగోలాగ బతుకు యీడ్చుకుపోగలదు కాని, చక్షువులు లేకపోతే జీవించలేదు. అది లేనంతకాలం వెలుగూ—చీకటీ—అనే విభేదం వుండదు' ఆమాటలు శిథిలమయిన కట్టడంలోంచి వస్తున్నట్టున్నాయి. ఏదో లోతైన ఆవేదన—దుఃఖానికి చెలు ధ్వనంతో వూగిన లాశీవట్టు

"అలా ఎందుకనుకుంటారు? ఎలాగూ రేపుజరగబోతుందిగా! రెండ్రోజుల్లో మీకళ్ళకు యౌవనం వస్తుంది" అంటూ నవ్వటానికి ప్రయత్నించాను. ప్రతి చిన్న విషయానికీ బాధపడుతూ, అనుమానపడుతూ వుండే వృద్ధులు మాట్లాడుతూగ్గాని వుదయిస్తున్న పరిస్థితిని కూడా నమ్మలేరు. రామయ్యగారిది నిజాయితీ బద్ధమైన వకాలతీ జీవితం.

"బాబు ఏదీ! కనపట్టం లేదు!" అన్నడిగాను. సుందరి ముఖంలో విచారరేఖలు విస్తరించాయి.

ఠంగా బతికారు - ఇందులో మెన్నుకో తగ్గదేమీ లేదు '

అతనితో వాదించి లాభం లేదని ముందే చెప్పాను.

రెండు ఎత్తైన కొండల మధ్య పెద్దలోయ - నా జీవితంలో అలాంటి చోటిలో నించి వుంటుందని నిరీక్షి అవతల కొండమీద కొన్ని గుహలు కనిపించాయి కాని అక్కడికి వెళ్ళమార్గం మాత్రం కనపడలేదు. రతన ఆ దృశ్యం ఫోటో తీయటానికి కెమెరా సరిచేస్తున్నాడు సుందరి లోయకేసి తదేక దీక్షగా చూస్తోంది నేను ట్రైపాయిడ్ సరిచేస్తున్నాను.

సుందరి ఒక్కసారిగా కెవ్వుమంది

బాబు కనపడలేదు ప్రకృతి సౌందర్యాన్ని చూస్తూ మమ్మల్ని మేం మర్చిపోయి అతన్ని గురించి ఆలోచించ లేదు అసలే అల్లరిపిడుగు. అంతలోనే కొత్తచోటు రతన కంగారుగా నాలుగు వైపులా చూశాడు 'అమ్మోయ్' అని అరుస్తూ బాబు గుహలోంచి పరుగెత్తుకొచ్చాడు

ఆ గుహలోపల ఎడంపక్కనే చిన్న గదిలా వుంది అక్కడంతా చీకటితో నిండివుంది ఒంటరిగా వస్తే ఎంతటి గుండెనిబ్బరం వున్న వాళ్ళైనా జడుసు కుంటారు అయినా అతివా చీకట్లోకి ఏముందని వెళ్ళాడో? కళ్ళు తిరుగుతున్నాయి ముఖంనిండా చెమట బొట్లు మళ్ళీ గట్టిగా అరిచాడు

'ఏంట్రా? ఏమయింది? అసలక్కడి కెందు కెళ్ళావు?' అని కంగారుపడ్డాడు రతన. బాబు సమాధానం చెప్పక వెర్రిగా చూశాడు

'జడుసుకున్నట్టున్నాడు రాకుమారి మళ్లీ మాట్లాడించి. ఇంక దిగి పోదాం—పదండి—బాబూ' అని సుందరి సమాధానంకోసం ఎదురుచూడ కుండా గబగబా దిగిపోయింది చేసేదిలేక మేం కూడా అనుసరించాం అది! అప్పుడు జడుసుకు న్నాడు—అందుకే యీ జ్వరం

నా ఆలోచనలు ఒక చోటికి వచ్చి ఆగిపోవటం రతన నన్ను నవ్వుతూ పలకరించటం ఒక్కసారే జరిగాయి హఠాత్తుగా ఆఫీసులో ఇన్స్పెక్షన్ వచ్చి పడిందని, ఫోన్ చేసి మళ్లీ వెళ్లవలసి వుంటుందని చెప్పాడు. ఆఫీసుదుస్తులైనా విప్పకుండా తిన్నగా బాబుపడుకున్న మంచందగ్గరకు వచ్చాడు. అమాయకంగా నవ్వుతూ నిద్రపోవటం అతని కొమ్మాగ్యాన్ని కలిగించింది మెడవరకూ దుప్పటి కప్పి వుండటంవలన మెడలోని తాడు అతనికి కనిపించే అవకాశంలేదు సుందరి తెలివైంది కనక ముందుజాగ్రత్త పడింది వ్యక్తిగతాభిప్రాయం ఎలావున్నా ఈ ప్రత్యేక విధ్యమాన్ని ఖండించలేకపోయాను. రతన బాబు నుదుటిమీద చెయ్యివుంచి చూశాడు

'అరే! జ్వరం వార్తలకు తగ్గినట్టుందే! చిత్రం! డాక్టరు మాడు గంటలకూ టెంపరేచర్ వాచ్ చేయమన్నాడే! సుందరీ! వొడ్డించు! ఇదుగో వస్తున్నా' అంటూ కదిలిపోయాడు

సుందరివిడిచిన దీర్ఘమైన నిట్టూర్పులో వుంటే అర్థం నా ఒక్కడికే తెలుసు పెదవుల మధ్యనుంచి కిటికీవైపుగా పేలటానికి సిద్ధంగావున్న నవ్వును బలవంతంగా అణుచుకుని వంటింట్లోకి వెళ్లింది

నాటకరంగంమీద ఓపాత్ర ఎడంపక్కనుంచి వెళ్ళగానే కుడిపక్కనుంచి మరోపాత్ర ప్రవేశించటంలా రతనచేతిలో థర్మామీటరుతో ప్రత్యక్షమయ్యాడు ఇంకో నిమిషంలో బాంబు పేలుతుందనుకున్నాను టెంపరేచర్ చూసే ప్రయత్నంలో ఆ 'మంత్రరక్ష'ను కనుక్కున్నాడు

'సుందరీ!' అని పిలిచాడు

పాత్రలన్నీ మళ్ళీ రంగంమీదికి చేరుకున్నాయి

'చూడండి' మీకు కోటి నమస్కారాలు నన్ను మీరేమన్నా చేసినా, ఫరవాలేదు కాని బాబునుమాత్రం దక్కనీయండి మీకుతోడుగా. ఒకరు చెబితే అర్థంకాదు చిన్నపిల్లలు జడుసుకోటం సహజం—అందుకు ఏ డాక్టరూ ఇంతవరకూ మందు కనిపెట్టలేదు వైద్యం చేయలేదు'

సుందరి దీనంగా చెప్పుకుపోయింది

రతన ఫక్కున నవ్వేసి ఆ తాడు కాస్తా పుటుక్కున తెంపేశాడు

'పట్టివెర్రిపిల్ల మా సుందరి' అంటూ రాక యుక్తంగా పలికాడు ఈ సంఘటనలో బాబు మేల్కొని గట్టిగా ఏడవటం మొదలుపెట్టాడు అతని దృష్టిలో ఇలాంటి నమ్మకాలకు ప్రాధాన్యం లేదు.

తున్నాయి. ఇతరులకు హాని కలగనప్పుడు వారిని సంతోష పెట్టటానికి మన క్షేమం లేకపోయినా ఓ సిద్ధాంతాన్ని ఆచరిస్తున్నట్లు నటించటంలో తప్పులేదు. శూన్యాన్ని చూపిస్తూ అక్కడేదో విచిత్రమైన వస్తువుందని ఎవరైనా వాదిస్తే ఆ వాదాన్ని ధిక్కరించి, విమర్శించి పోట్లాడుకోటం అనవసరం.

పది రోజులు గడిచాయి.

ఆరోగ్యం సరిగ్గా వుండకపోవటంవలన రవణ ఇంటికి వెళ్ళటం వీలుపడలేదు. అందుచేత అక్కడి వాతావరణం ఏ విధంగా తయారైందీ నాకు తెలియదు. ఓ నాడు సాయంత్రం కిటికీ దగ్గరగా పడక్కుర్చీలో పడుకుని పత్రిక చూస్తున్నాను. ఎదురుగా టాక్సీ రోడ్డువారగా ఆగింది. చెయ్యిపట్టుకుని రామయ్య గారిని రవణ నడిపించి తీసుకువస్తున్నాడు. నాకేం అర్థంకాలేదు. రామయ్యగారిని మంచంమీద కూర్చో బెట్టి, నేనేమీ అడక్కుండానే రవణ మొదలు పెట్టాడు.

'నాన్నగారు నా దగ్గర వుండటాని కిష్టపడటం లేదు. చిన్నాన్నగారి వూరెళుతున్నారు. మిమ్మల్ని చూడాలంటే తీసుకువచ్చాను'

'చూడు నాయనా! చిన్నప్పట్నుంచీ కట్టుబాటుతో, దైవభక్తితో పెరిగాను. ఈ ముసలితనంలో నా నియమాలన్నీ ఎలా వదలగలను? ఆపరేషన్ చేశాక వున్న కన్నుకూడా పోయింది'

'మాస్టారూ! నేనెదివరకే చెప్పాను. తప్పంతా ఆ సర్జన్‌దే - దానికీ దేముడికీ ఏదైనా ఆస్కారం వుందేమో చూడండి - నేను సిద్ధంగా వున్నాను'

'నువ్వు వృథాగా శ్రమపడకు. నేను చేసుకున్న పుణ్యం అంతే - దేవుడికి నామీద దయతప్పింది'

'అలాగనకండి! కాలం ఒకేరీతిగా వుండదు - ఈ పరిస్థితుల్లో మీరు కన్న కొడుకుకి దూరంగా వెళ్ళి పోవటం మంచిది కాదు'

రామయ్యగారు నవ్వారు.

'నేను ముందే చెప్పాను ఇది రెండుతరాల సిద్ధాంతాల మధ్యవున్న పోరాటం. నాకిది తప్పదు. దూరంగా వుండటం మంచిది'

రవణంటే నాక్కూడా అసహ్యంవేసింది. కట్టుకున్న పెళ్ళాన్ని పంపేశాడు. తండ్రిని తరిమే వాడు. అతను సాధించిన దేమిటి? తరువాత సంభాషణ ఎంతో సేపు సాగలేదు — ఇద్దరూ తిరిగి వెళ్ళి పోయారు.

నేటి విజ్ఞానం దైవాన్ని గురించి ప్రస్తావించదు. సిద్ధాంతాలను అల్లుకుంటూపోయి చివరకు అనంతంలో అస్తమిస్తుంది. నిప్పులేనిదే పొగరానివ్వదన్నట్టు, దేవుడనేవాడే లేకపోతే ఈ చరిత్ర ఎలా పుట్టింది? కారణరహితంగా ఏదీ జనించదు. తరతరాలుగా వొస్తున్న నమ్మకాల్ని కాలదన్ని, మనకున్న స్వల్ప తార్కిక జ్ఞానంతో అనంతమైన వెలుగులో ఓ కిరణం కాలూను అణువుమాత్రం చూడకలిగి నేను సర్వస్వం తెలుసుకున్నానని గుండెమీద చేయివేసుకుని చెప్పటం సులభం కావచ్చు. కాని అందుమూలంగా ఏర్పడే చిక్కులు అనంతం. అవన్నీ నిస్సహాయతతో వున్న మృగాన్ని కొండచిలువలా చుట్టేసి నలిపేస్తాయి.

* • *

నాలుగుమాసాలు గడిచాక ఓ నాడు రవణ ఇంటికి వెళ్ళాను. బాబుపోయాక, అప్పుడప్పుడు కలుసుకుని యోగక్షేమాలు విచారించటమే కాని, ఇంటికి వెళ్ళటం ఇదే మొదటిసారి. హాల్లో ఎవరో అమ్మాయితో పకపక నవ్వుతూ కబుర్లు చెబుతున్నవాడల్లా నన్ను చూసి కొంచెం కంగారుపడ్డాడు. ఆ అమ్మాయికూడా వినయంగా లేచి నిలబడింది. నాకేం అర్థంకాలేదు. కట్టుకున్న పెళ్ళాన్ని వద్దనుకుని ఏవిటీ పగటి వేషాలనిపించింది. అయినా, నిజానిజాలు తెలుసుకోకుండా తొందరపడకూడదని నిగ్రహించుకున్నాను. కుర్చీలో కూర్చోబెట్టాడు. 'నామీద కోపమింకా తగ్గలేదా? నేను మీకు చేసిన ద్రోహమేమిటి?' అడిగాడు.

'అబ్బే! అలాంటి దేమీలేదు. తీరుబడిలేక' అని నేనింకా వాక్యం పూర్తి చేయకుండానే 'అప్పుడప్పుడు తలుచుకుంటున్న పనులు సరేకానీయండి ఇంక పరిచయాలు చేస్తాను. ఈ లలన నా ద్వితీయ కళత్రం. పేరు సుజాత. వివాహం గప్‌చుప్‌గా జరిగినందుకు క్షమించండి. ఈయన నా నీతి ప్రొఫెట్ సాంబమూర్తిగారు — ఫేమిలీ ఫ్రెండ్' అనగానే ఆ అమ్మాయి నమస్కరించింది. శరీరంలో ప్రతిరక్తపుచుక్క కోపంతో పొంగిపోయింది. ఆ అమ్మాయి వయ్యారంగా లోపలకు నడిచివెళ్ళి

పక్లెంలో మైసూరుపాకులు, గ్లాసు నిండా పాలూ తీసుకొచ్చి నా ముందర వుంచింది.

'ఛీ! . నిన్ను మనిషి కింద జమకట్టటం నా పొరపాటు. నిష్కారణంగా సుందరి జీవితం నాశనం చేసినందుకు బాధలేదు. సిగ్గులేదూ మళ్ళీ అమ్మాయిని పెళ్ళిచేసుకున్నావు, ఎవరెస్టు శిఖరం ఎక్కినట్టు గొప్పగా చెబుతున్నావు. ఇదుగో రమణా! ఈ నాటి నుండి నీకూ, నాకూ సంబంధం నాస్తి' అంటూ అరిచాను.

'ఎవరూ? అన్నయ్యగారా? గది కప్పు కొట్టు పైకెగిరి పోగలదు. ఏమిటంత గట్టిగా అరుస్తున్నారు?' అంటూ సుందరి ప్రత్యక్షమైంది

'నాకళ్ళను నమ్మమంటారా? వద్దా?" అడిగాను

"తప్పనయ్యా! ఎదురుగా కనిపిస్తుంటే ఎలా కాదనగలం? మీరు మరి ఇప్పుడే స్నానం చేసి వచ్చినట్టుంది జుట్టు తడిగావుంది" అన్నాయి

"ఏమిటిదంతా?" అడిగాను

'మా కోపాగ్ని రగిల్చినందుకు క్షమించండి. కులాతిసుందరికి స్వయానా చెల్లెలు సుందరికన్నా రెండాకులెక్కువైంది మిమ్మల్ని రమ్మన్నది ఇందుకే'

'తలంపుగల కార్యాలు అప్పటిమీద అరగించా' లన్నపాత సామెతను జ్ఞప్తికి తెచ్చుకున్నాను

తరువాత రమణ జరిగినదంతా వివరంగా చెప్పుకు పోయాడు. నేను ముందే చెప్పాను అతను సుందర్ని విడిచి బతకలేడని మామగారింటికి వెళ్ళి సుందరిని వచ్చేయమని నానారకాల దండోపాయాలు ప్రయోగించి చివరాలి విజయం సంపాదించాడట.

'రేపే అమ్మా, నాన్నా వస్తున్నారు వారం రోజుల క్రితం చిన్నాన్నగారి వూరు వెళ్ళాను ఇదర్ని ఒప్పించేసరికి తలప్రాణం తోకకు వచ్చింది నేను నాస్తికుడినయితే గుర్తు నన్ను దండిస్తాడుకాని అమాయకులైన వాళ్ళిందరిని దండిస్తాడని నచ్చ చెప్పాను మరో సర్జన్ చేత ఆ రెండో కంటికి ఆపరేషను చేయించాలి'

మనుష్యుల మనస్తత్వాలు ఎంత స్వల్పకాలంలో మారిపోయాయి! .

నాలుగైదు నెలలు గడిచాక ఓనాడు నేను వెళ్ళే సరికి రమణ ఆఫీసుకు వెళ్ళిపోయాడు ఇల్లంతా చిక్కు చిక్కుమంటూవుంది. బాబు అటూయిటూ నవ్వుతూ గెంతుతుంటే చీకటి గృహంలో మెరుపు మెరసినట్టుంది. సుందరి శుచిగా పూజచేస్తోంది.

'ఏమిటిది?' అడిగాను ఆశ్చర్యపోతూ.

రమణతల్లి చెప్పుకుపోయింది

'ఏముందినాయనా! ఆదేవుడికింకా మామీద దయ కలగలేదు పుట్టిన ఒక్క నలుసూ అలాపోయిందా మరి—ఇంక దానికి సంతానప్రాప్తి లేదని మొన్న ఎవరో జ్యోస్యం చెప్పారు. అప్పట్నుంచి అది బెంగ పెట్టుకుంది వాడితో చెబితే జ్యోస్యమంతా కట్టె బూటకమన్నాడు చివరకు బతిమాలి వాణ్ని సత్యనారాయణ వ్రతం చేసుకోనిమన్నాను మొగుడూ, పెళ్ళాం కలిసి ఏఅన్నవరమో వెళ్ళి వ్రతం కాస్తా చేస్తే పిల్లలు వెంటనే పుడతారు? కాని మావాడు దైవ నామస్మరణ కూడా చేసాడూ? అందుకని ప్రతిశుక్రవారం అదొక్కటే ఇలా చేసుకుంటోంది దేవుడికి కనికరం కలక్కుండా వుంటుందా?'

'అది సెలా వప్పుకున్నాడు? ఆశ్చర్యంగా వుందే!'

'పాపాయి కావాలని అతనికిమాత్రం వుండదా యేమిటి? అదలావుంచి ఇది దేవుడికి కత్తి పరీక్ష—సీటు రయి మూడ్డాం—అన్నాడు ఒకవేళ పాపాయి పుటితే అది దైవప్రసాదమని నమ్మడమేగా' సుందరి ఈ మాటలన్నీ వింటూ సిగ్గుతో తల వంచేసుకుంది. ఆమె బుగ్గలు ఎర్రగా కందిపోయాయి.

ఆ వ్రత ఫలితం ఏమిటో తెలుసుకోటానికి కొంతకాలం పట్టింది.

ఓనాడు రమణ నన్ను 'ఇరానీ రెస్టారెంట్'లో పట్టుకున్నాడు

'చిన్న పార్టీ వుందండి మీరు కూడా రండి' అంటూ తీసికెళ్ళి రకరకాల బొమ్మలు, చీరలూ, పువ్వులు కొన్నాడు నన్ను కూడా ఇంటికి రమ్మన్నాడు.

'ఈ బొమ్మలెవరికి?' అడిగాను.

'మా చిన్నాన్న కుటుంబం నిన్ననే దిగింది చిన్నాన్న కొడుక్కి' అన్నాడు. అతన్ని నే నింతవరకూ చూసలేదు కనక పరిచయం చేసుకుందామనుకుని అతన్ని వెంబడించాను తీరా వెళ్ళి ఇలుచేరుకున్నాక అక్కడ కొత్త మొహాలేమీ కనపడలేదు

'మీ చిన్నాన్న పాపాయి ఏదీ?' అడిగాను.

'ఆ పాపాయి మా రెంగుకంటే! మా యింట్లో కి పాపాయి రాబోతుంటే! . మరి బొమ్మలన్నీ ఎందు కనుక్కొన్నాను!' అని దబాయించాడు. ఆశ్చర్యంగా సుందరివైపు చూశాను

సిగ్గుతో తలవంచుకుని అక్కణుంచి కదలి పోయింది.

'కంగ్రాచ్యులేషన్స్ - సత్యనారాయణమూర్తి గారు' అన్నాను

'అంతా మాంబో' అన్నాడు

ప్రసూతికి రతణ కుటుంబంలో అందరూ నవ్వుతూ కనిపించినా అతని విపరీత సిద్ధాంతాలు ఏదో కొత్త తుఫానును లేవదీస్తాయని నాకు తెలుసు. అందుకని అతనిలో శాశ్వతమైన మార్పు తీసుకురావటమెలాగని ఆలోచించి ఆలోచించి ఏ నిర్ణయానికీ రాలేకపోయాను రతణ వ్యక్తులతో పోరటం కాగిం చటం మా చేతి గడియారం పుట్టి నమ్మకాలతో ఏ రాది గెలుపొందితే బాగుంటేది రాత్రి పదకొండు గంటలవుతుంది

మామూలుగా తొమ్మిదింటికే వస్తే తెలికాని వీధ పదేసుంది ఆ నాడు ఎంత ప్రయత్నించినా కన్ను మూతపడలేదు అంటే దానికేదో కారణం వుందని తృప్తిపడదాము. దీపం ఆర్పేయటానికి మంచం మీదనుంచి లేవటం, ఎవరో తలుపుతట్టటం ఒకేసారి జరిగాయి తలుపు కిర్రుమంటూ తెరుచుకుంది రతణ లోపల కొచ్చాడు పున్నమినాడు దివ్యంగా వెలుగుతున్న చంద్రుడు ఒక్కసారి కాంతి విహీనంగా తయారవుతే ఎలా వుంటుంది! రతణ ముఖం కూడా అలాగేవుంది చాక్కి చెమటతో తడిసిపోయింది పెదవులు వణుకుతున్నాయి

'మూర్తిగారూ! తక్షణం రావాలి—సుందరికి నెప్పులు ప్రారంభమై అయిదుగంటల పైచిలుకవుతుంది డాక్టర్ లాడ్ ప్రసవం సులభంగా జరగదని, ఆపరేషన్ చెయ్యాలని అంటున్నాడు అదికూడా ప్రమాదంతో కూడిందంటున్నాడు ఏంచేయమని చెప్పండి—' అంత మనిషీ విలవిలా కంపిస్తున్నాడు

'రతణా! ఇందులో సేనుమాత్రం చేయగలిగిం దేముంది? డాక్టర్ని బతిమలాడటం మినహా—'

'అబ్బే!. అదంతా పూర్తయింది. ఇంక తన బలవ అదృష్ట దేవా లేవని, అంతా దేవుడి చేతిలో కే వుందని అన్నాడు—'

'అప్పుడు అతివప్పటి సరైందే—దేవాన్ని నువ్వు ధిక్కరించలేవు నీ యిష్ట విషాలతో అతనికి సంబంధంలేదు నన్నడిగితే సుందరిని దక్కించుకలిగింది ఒక్క భగవంతుడే!'

రతణ అయిదు నిమిషాలవరకూ మాటాడలేదు ఒక్కసారిగా ఆవేశం వచ్చినవాడిలా గోడమీదున్న శ్రీకృష్ణుని పటానికి నమస్కరించి, చెంపలు వాయించుకుని, 'కృష్ణా! నన్ను క్షమించు, నా అభిప్రాయాలు పురాణ లేవని నా సుందరిని దక్కించు' అన్నాడు

నా కళ్ళలోకి ఆనందంలో పూసిన నీలిచివారుం దనుకున్నారు

ఇద్దరం టాక్సీలో హాస్పిటల్ కు వచ్చాం

డాక్టర్ లాడ్ చిరునవ్వుతో బయటికొచ్చాడు

'కంగ్రాచ్యులేషన్స్ మిస్టర్ రతణా!' వెంకపిల్లాడు

భయపడవలసిన అవసరంలేదు మూర్తిగారూ!

'మీతో కొంచెం మాట్లాడాలి ఇలారండి' అంటూ నన్ను తన గదిలోకి తీసుకపోయాడు.

'చివరకు దేవుడికి దండం పెట్టాడా లేదా?'

'ఆ అంతా అనుకున్నట్టే జరిగింది'

డాక్టర్ లాడ్ కన్నుగీటి పెద్దగా నవ్వాడు

గదిలోంచి బయటకొచ్చాను. రతణ ముఖం ప్రశాంతంగా వుంది.

'రతణా! నువ్వు ఏమనుకున్నా సరే! ఈ లోకంలో సుఖంగా బతకాలనివుంటే నలుగురూ అవునన్నదాన్ని కాదనకుండా, ఖండించకుండా వుండాలి దాన్ని మనం నమ్మినా, నమ్మకపోయినా, నమ్మినట్లు నటించటంలో తప్పులేదు ఈ నటనవలన ఇతరులకు బాధలేదు మనకూ బాధలేదు పత్యేకమైన బతుకులు గడిపే మందిలో మానవుడిగా బతకటం ఏ నాస్తికుడిగానో—హిపోక్రటీస్ గానో—గెలీలియోగానో—లూథర్ గానో బతకవలసి వుంటుంది మనం బతికేది స్వల్పకాలం ఈ మాత్రం దానికి కోరి కోరి తో సత్తికోసుక్కవట్టు కష్టాలను తెచ్చుకోవటం ఎందుకు?'

రతణ అంగీకార సూచకంగా తల వూగించాడు. చివరకు నాలో సందేహం కలిగింది—ఇందులో గెలిచిందెవరు? ఓడిపోయిందెవరు? ఏమో!.. జయాపజయాలు దైవాధీనాలు—

సరైన సమాధానం మాత్రం రాలేదు.

రాదు కూడా—

# మన స్వీయ చరిత్రలు

శ్రీ డి. రామలింగం

నేటి గద్య రచనాశాఖలలో స్వీయ చరిత్ర ఒకటి. పూర్వం మన సాహిత్యంలో స్వీయ చరిత్రలంటూ లేవు. అసలు చరిత్ర రచన విషయంలోనే మన దేశీయులకు మొదటినుంచీ అంత శ్రద్ధవున్నట్లు కన్పించదు. మన పూర్వీకులు ఎంతసేపూ పారమార్థిక విషయాలకే ప్రాధాన్య మిచ్చారు గాని లౌకిక విషయాలపై వారికి అంతగా ఆసక్తి లేదు. అందుచేతనే కాళిదాసు ఏ కాలం నాటి వాడు? రామాయణం వ్రాసిన మొల్ల కుమ్మరివారి ఆడపడుచా, కమ్మరివారి ఆడపడుచా? అనే ప్రశ్నలు ఉదయించి ఇప్పటికీ సందిగ్ధంగానే సమాధానం చెప్పుకోవలసి వస్తున్నది. మన ప్రాచీన కవులు తమ కావ్యాల అవతారికలలో తమ పుట్టు పూర్వోత్తరాలను, తమ కృతిని అంకితం పొందేవారి వంశ చరిత్రను కొంత వ్రాసుకున్నారే గాని వాటివల్ల ఆ కృతికర్తల, కృతి పతుల జీవిత విశేషాలు అంతగా తెలియవు. అలాంటి విశేషాలను తెలిపే గ్రంథాలను వారు ప్రత్యేకంగా వ్రాయలేదు. అది మన సంప్రదాయం కాదనే కారణం చేతకూడా సంకోచించి వదలిపెట్టారు. అయితే ఆధునిక కాలంలో వచన రచన బాగా వ్యాప్తిలోకి వచ్చిన తరువాత అనేక సాహితీరూపాలతో పాటు స్వీయ చరిత్ర అనే క్రొత్త రీతికూడా ఆవిర్భవించింది. అప్పటి నుంచీ తెలుగు సాహిత్యంలో కొన్ని స్వీయచరిత్రలూ, ఆత్మకథలూ వెలువడ్డాయి.

స్వీయ చరిత్ర అనగా తనను గూర్చి తాను వ్రాసుకోవడం. అలా వ్రాసుకోవడంలో కొన్ని చిక్కులున్నవి. ఇతరులను గూర్చి వ్రాయడం సులభం కాని తన్ను గూర్చి తాను వ్రాసుకోవడమంటే అనేక చిక్కులతో కూడుకొన్న పని. ఆత్మ చరిత్ర వ్రాసుకోవడానికి వ్యక్తిగతంగా కొంత ప్రతిపత్తి వుండాలి. అంటే ఇతరులకు చెప్పదగిన వృత్తాంతమంటూ ఒకటి వుండాలి. సారవంతమైన జీవితం గడిపి, తనకూ కొంత చరిత్ర వున్నదన్న విశ్వాసం కలిగితేనే ఆత్మ కథలు వ్రాయడం పనికొస్తుంది. అటువంటి చరిత్ర ఏదీ లేనప్పుడు అది ఆత్మకథ గాక ఎవరో అన్నట్టు ఆత్మస్తోత్ర అవుతుంది. అయితే చెప్పుకోదగిన చరిత్ర వున్నప్పటికీ ఏదో తెలిసినంత వరకు సేకరించేగాని తన్ను గూర్చి తాను చెప్పుకోవడమేమిటి? అనే భయంతో ఆ పనికి పూనుకోవడానికి కొందరు వెనకాడుతారు. ఒక వేళ వ్రాయాలనే అభిలాష వున్నా ఆత్మస్తుతి, పరనింద అవుతుందేమోనని జంకుతారు. పైగా స్వీయ చరిత్ర సమగ్రంగా వ్రాయాలంటే మొదటినుంచీ ఎప్పటి విశేషాలను అప్పుడు డైరీలో వ్రాసి, ఆ డైరీలను పదిలపరచుకొని వుండాలి. అలా దిన చర్యలు వ్రాసే అలవాటు మన వారిలో చాలామందికి లేదు. మరి పాశ్చాత్యులు అలాంటి దినచర్యలను ఆధారంగా పెట్టుకొనే పెద్ద పెద్ద గ్రంథాలు బాగా రచించుకోగలిగారు. అటువంటి డైరీలు లేనప్పుడు కేవలం జ్ఞాపకశక్తిమీదనే ఆధారపడవలసి వస్తుంది. అలాంటి సందర్భాలలో కొన్ని తప్పులు దొర్లడం సహజం.

ఇన్ని చిక్కులున్నప్పటికీ కూడా తెలుగులో స్వీయ చరిత్రలు వెలువడ్డాయి. కొందరు పెద్దలు మిత్రుల ప్రోద్బలంచే వ్రాసి, మరికొందరు వారికి బుద్ధిపుట్టి వ్రాశారు. మానవుడు సంఘజీవి. తన కష్టసుఖాలను తోటివారికి చెప్పుకోవాలనే కోర్కె ప్రతివారికీ వుంటుంది. ఆ కోర్కెననుసరించే తాము చేసిన పనులను, పడ్డ కష్టాలను, తమకు కలిగిన అనుభవాలను ఇతరులకు చెప్పాలన్న అభిలాషతో స్వీయచరిత్రలు వ్రాశారు. ముందు దారిపోయినవారెలా జీవించారో వెనుక వచ్చినవారు తెలుసుకొనే అవకాశం లేకపోతే అనుభవం అనే మాటకు ప్రయోజనం వుండదు. కనుక తమ చరిత్రలను చూచి తమ సంతతివారు, బంధువులు, కుటుంబ గౌరవాన్ని నిలబెట్టుకొని, స్వశక్తిమీద ఆధారపడి ఉత్కృష్టాదర్శాలతో జీవిస్తారన్న ఆశయంతో కొందరు వ్రాశారు. మరి కొందరు తమ చరిత్రలను తమ ఆనందంకోసం వ్రాసుకున్నారు. ఇంకా కొందరు కాలం గడచినమీదట తమకు

కష్టాలు పడువారు తమ చరిత్ర చూచి, పూర్వం తమ వంటి వ్యక్తి ఒకరు వుండేవారని తెలుసుకొని ఊరట పడతారన్న ఆశతో వ్రాశారు. ఏ ఆశయంతో, ఏ ప్రోద్బలంతో వారు వ్రాస్తేనేమి వాటివల్ల మన సాహిత్యంలో స్వీయచరిత్రలు లేని కొరత తీరడమే గాక, ఆ పెద్దల జీవితచరిత్రల మూలకంగా దేశచరిత్ర కూడా తెలుసుకొనే అవకాశం కలుగుతున్నది.

ఆంధ్ర సాహిత్య లక్ష్మికి వచన రచన, ఉపన్యాసాలు, నాటకాలు, ప్రహసనాలు, జీవితచరిత్రలు, ప్రకృతి శాస్త్రాలు, నవలలు మొదలైన అనేక నూతనాలంకారాలను చేకూర్చి, అధునిక వాఙ్మయ రూపాలకు బాటలు వేసి, ఆంధ్రదేశ చరిత్రలో యుగకర్త అని పేరు పొందిన మహనీయుడు కందుకూరి వీరేశలింగం పంతులుగారే తెలుగు సాహిత్యంలో స్వీయచరిత్ర లేని కొరతను తీర్చారు. మన మొట్టమొదటి స్వీయచరిత్రకారిగా వారు తమ చరిత్రను వ్రాస్తూ "తెలుగుభాషలో స్వీయచరిత్రమును వ్రాయబూనుట కిదియే ప్రథమ ప్రయత్నము తన్ను గూర్చి తాను వ్రాసుకొనునప్పుడు ఈశ్వర ముఖమును చూచి సత్యమునే చెప్ప బూనినను సమకాలపు వారది అతిస్తుతిగానో పరనిందగానో భావించి అన్యథా తలచవచ్చును ఒకానొకప్పుడు పరులనుగూర్చి అప్రియములగు సత్యములను బయలుపరుపవలసివచ్చినప్పుడు వారికిని, వారి మిత్రులకును, బంధువులకును మనస్తాపము కలుగవచ్చును అయినను సాధ్యమైనంతవరకు అన్యుల మనస్సులకు నొప్పి కలిగించెడు విషయములను అనావశ్యకముగా ఇందు జొప్పింపమానితిని" అని చెబుతూ ఇటువంటి దుష్కరమైన కార్యానికి తాము పూనుకొన్నందుకుగాను దానిని సమంజసంగా నిర్వహించేందుకు శక్తిని ప్రసాదించవలసిందిగా ఈశ్వర ప్రార్థన కూడా చేశారు. వీరేశలింగంగారి స్వీయచరిత్ర ఒక విధంగా ఆంధ్రదేశ సాంఘిక చరిత్ర అందులో ఆ మహానుభావుని జీవిత విశేషాలేగాక అప్పటి దేశస్థితి, విద్యావిధానం, సంఘంలో అమలులోవున్న దురాచారాలు, మూఢవిశ్వాసాలు మొదలగువాటి నన్నిటినీ బహిరంగం చేశారు. అట్టి సాంఘిక స్థితిని సంస్కరించదలచిన లక్ష్యంతో వారు ఎట్టి ప్రయత్నాలు చేశారు? ఏయే ఇబ్బందులు ఎదుర్కొన్నారు? ఎటువంటి అభియోగాలు వారిపై మోపబడ్డాయి? వాటి నన్నిటినీ తట్టుకొని ఎలా నిలువగలిగారు? ఆనాటి తెలుగు సాహిత్యం ఏ పరిస్థితిలోవుంది? ఆంధ్రజాతి అభ్యున్నతికి అతను చేసిన సేవ ఏమిటి? మొదలైన అనేక విషయాలు ఈ స్వీయచరిత్రలో విశదంగా వ్రాయబడ్డవి. వీరేశలింగంపంతులుగారికి, వారి ప్రత్యర్థులకూ జరిగిన వ్యాజ్యవివాదక వ్యవహారాలు, నోటీసులు, మిత్రులతో వారు జరిపిన ఉత్తరప్రత్యుత్తరాలు, వారి ఉపన్యాసాలు, వ్రాసిన పత్రాలు, ఆకాలంనాటి సంఘటనలపై పత్రికాభిప్రాయాలు, చాలావరకు యథాతథంగా ఉదహరించడం చేత అప్పటి ఆంధ్రదేశ విశేషాలు ఎరుగనివారైనా తెలుసుకొనే వీలు కలుగుతున్నది. సామాన్య కుటుంబంలో జన్మించి, పెద్ద పదవిలో లేకపోయినా, సంకల్పబలంతో ఆంధ్రజాతికి చరిత్రను కల్పించిన మహాపురుషుడు వీరేశలింగంపంతులుగారు. సంఘ సంస్కర్త, వచన రచనా పితామహుడు, బహుళ గ్రంథకర్త, దాత మహానుభావుడూ అయిన అతని స్వీయచరిత్ర ఏ తరంవారికైనా ఉత్తేజకరమైన గ్రంథం.

తిరుపతి రాంబొట్ల జగన్నాథశాస్త్రిగారు తమ స్వీయచరిత్ర వ్రాసుకున్నారు. ఈయన విశాఖపట్నం జిల్లా వాసి. రెండు గావంచాలు చేతబట్టుకొని ఇల్లు వదిలి, జీవయాత్రకు గడిగిన సామాన్యుడీయన. అయినా చివరకు వీరి ఈయన పంచశేరక తప్పెంది కొగు స్లీపరి వృత్తిలో అటు వ్యాపారులకూ, ఇటు న్యాయవాదులకూ గౌరవభాజనుడై ఘనతగాంచిన వ్యక్తి. ఈయన స్వీయ చరిత్రను వెలలేదు బంధుమిత్రుల కోసమే ప్రచురింపబడింది.

కృష్ణాజిల్లా దివి తాలూకా వక్కలగడ్డ గ్రామవాసి, బలభద్ర కోటయ్య తమ ఆత్మకథ వ్రాసి ప్రకటించారు. వీరు విశ్వబ్రాహ్మణులు, బ్రాహ్మణ ప్రభావంతో స్వీయ సంఘోద్ధరణకై పాటుపడ్డ వ్యక్తి.

రాయసం వెంకట శివుడుగారు తమ స్వీయచరిత్ర వ్రాసి ప్రకటించారు. ఈయన వీరేశలింగం పంతులుగారి శిష్యుడూ, సహచరుడూ బాల్యంనుంచి సత్ప్రవర్తన కలిగి ఉన్నత విద్యాభ్యాసంచేసి, ఉపాధ్యాయ పదవిలోవుండి, కటకపటం నెల్లూరులోని వెంకటగిరి మహారాజా వారి కళాశాలకు ప్రధానాచార్యులై 'సత్యసంవర్ధని,' 'జనానా' మొదలగు పత్రికలను నడిపి, స్త్రీ జనాభ్యుదయానికై కృషిచేసి, గుంటూరులో కొన్ని వేల రూపాయలు ఖర్చుపెట్టి ఒక

మందిరమును నిర్మించి ప్రజల కర్పించిన ఉదార పురుషుడీయన. వీరి ఆత్మచరిత్రకు దేశోద్ధారక కాశీ నాథుని నాగేశ్వరరావు పంతులుగారు పీఠిక వ్రాస్తూ 'ఇది వెంకట శివుడుగారి సొంత కథకాదు. ఆంధ్ర దేశంలోను, హిందూదేశంలోను, ప్రపంచమంతను కలిగిన భావపరివర్తన కూడా ఇందున్నది' అన్నారు.

'సూర్యనారాయణీయము' మరొక స్వీయ చరిత్ర. ఇది 'సామాన్య సంసారి జీవిత కథ' అని రచయిత వలూరి సూర్యనారాయణరావుగారు చెప్పుకున్నారు. బందరులో వకీలుగా, సంఘ సంస్కర్తగా, రాజకీయ వాదిగా పేరుపడ్డవారీయన. అన్ని విషయాల లోను స్వతంత్రాలోచన గల వ్యక్తి. పరోపకారం ఆదర్శంగా పెట్టుకున్నవారు. తాము స్వార్జితంగా సంపాదించిన డెబ్బదివేల రూపాయల ఆస్తిని విద్యా సంస్థ కిచ్చివేసిన వదాన్యులు. మానవుడు స్వశక్తి మీదనే ఆధారపడి జీవించడం గౌరవమనీ, కర్మయోగు లుగా వుండి ప్రజాసేవ చేయవలెననీ, ఈయన తమ స్వీయచరిత్రద్వారా ప్రబోధించారు.

'కళాప్రపూర్ణ' చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారి స్వీయచరిత్రకొక ప్రత్యేకత వున్నది. ఈయన పుట్టంధుడు కాదు గని తరు వాత దృష్టిని కోల్పోయారు. పుట్టింది బహు సామాన్యకుటుంబం. కాని వ్యక్తిత్వం గొప్పది. చిలకమర్తివారు వీరేశలింగంగారి అనుయాయుల్లో సంఘ సంస్కరణోద్యమానికీ, సాహిత్యానికీ, తెలుగు నాటక రంగానికీ అపారమైన సేవచేశారు. మొదటినుంచీ వీరికి ప్రజాహితజీవనం గడపవలెనన్న వాంఛ వుండేది. స్వయంగా ఎక్కడికీ పోలేకపోయినా, ఎవరితో ఒక రిని వెంటబెట్టుకొని శ్రమపడి ప్రతి మహాసభకూ హాజరై వక్తల ఉపన్యాసాలను శ్రద్ధగా విని, నిష్పక్షపాతంగా తమ అభిప్రాయాలను వ్యక్తీకరించి, ప్రజాహిత జీవ నంలో ఉద్వేగం కలిగించిన ప్రతిభాశాలి. ఈయన హాజరైన మహాసభలు, ఇచ్చిన ఉపన్యాసాలు అనేకం. ఆంధ్రదేశంలో విద్యావ్యాప్తికి, సంఘ సంస్కరణకు, మతోద్ధరణకు, నిమ్నజాతుల సంక్షేమానికి, మహి ళాభ్యుదయానికీ రాజకీయ సంస్కరణలకు, లలితకళల అభివృద్ధికీ ఎంతో పాటుపడడమేగాక అనేక గ్రంథాలు రచించి ఆంధ్ర విశ్వవిద్యాలయంవారి 'కళాప్రపూర్ణ' బిరుదుపొంది, తెలుగు సాహిత్యంలో చిరస్థాయిగా వుండే స్థానం సంపాదించుకొన్న ప్రజ్ఞావంతులు. మన స్వీయ చరిత్రలలో చిలకమర్తి వారి స్వీయచరిత్ర పాఠ కులకు అత్యంతాసక్తిని కలుగజేస్తుంది. కారణం వారి వచన రచనాశైలి, విషయ పూర్వకము, నిగ్రహా యుతము అయిన వారి చెప్పే విధానమూను.

ఆంధ్రోద్యమంలో, భారతదేశ రాజకీయ రంగంలో, విప్లవోద్యమంలో పనిచేసిన ముగ్గురు ప్రము ఖుల స్వీయచరిత్రలు తెలుగు సాహిత్యానికి అలంకార ప్రాయమైనవి. ఒకరు దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారు, శాసనసభ్యులుగా, ఆంధ్ర మహాసభా ధ్యక్షులుగా, కాంగ్రెసువాదిగా గాంధీమహాత్ముని గౌరవాదరాలకు పాత్రుడైన మహావ్యక్తి. ఈయన భారత ప్రథమ స్వాతంత్ర్య సమరం గడిచిన కొన్నేం డ్లకే దేశభక్తుడు పుట్టారు. ఆయన స్వీయచరిత్ర డెబ్బయి ఏండ్ల ఆంధ్రదేశ చరిత్ర భారతదేశ చరిత్రకూడా అంగులో వున్నది. సత్య తత్పరత, ఆస్తిక్యము, వినయం, నిరంతర సేవాసక్తి, ఆత్మనిగ్రహం—ఇవి దేశ భక్తుని ఉత్తమ గుణాలు. "జీవితములో సుఖదుఃఖము లనునవి వ్యక్తికి మాత్రమే సంబంధించినవి పనుల నుపక రించునవి సార్థక జీవనమని తోచును. అయితే ఈ నిష్టయును లోపము చేయకలసినదే. సాధారణముగ ఎవ్వరి జీవితమందైనను సుఖదుఃఖములు రెండును అను భూతములగుచుండును. దినదినమును నూతనానుభవములు కలుగుచుండుటచే, జీవితము నూతన కళలతో నొప్పారు నొక నాటకరంగమువలె నుండును. నిర్మల వర్తనము కలిగి, సత్యనిష్ఠతో ప్రవర్తించువారికి మనః క్లేశమునకు కారణముండదు." అని కొండా వెంకటప్పయ్య పంతులుగారు తమ జీవితానుభవమునుగూర్చి చెప్పు కొన్నారు.

రెండవది టంగుటూరి ప్రకాశం పంతులుగారి 'నా జీవితయాత్ర' అనే ఆత్మకథ. ఆంధ్రప్రజానాయ కులుగా ప్రకాశంగారు అనితరమైన స్థానం పొందారు. లక్షలు సంపాదించి, లక్షలు ఖర్చుపెట్టిన త్యాగి. గుండె నిబ్బరానికీ, ధైర్య సాహసాలకూ, త్యాగాలకూ ప్రకాశం పంతులుగారిని చెప్పుకొని మరొకరిని చెప్పాలి. ఆంధ్రుల గుణగణాలకు ఆయన ప్రతినిధి. కాంగ్రెసువాదిగా, పత్రికా సంపాదకుడుగా, మంత్రిగా అవిభక్త మద్రాసుకూ, ఆంధ్ర రాష్ట్రానికీ ముఖ్య మంత్రిగా ఆయన చేసిన సేవ అనుపమమైనది. అసలు దక్షిణ భారతంలో జాతీయోద్యమానికి నుండెనిచ్చిన ధీరోదాత్తుడు ఆయనే. ప్రకాశం పంతులుగారి స్వీయ

చరిత్ర యువకులకు ఆదర్శప్రాయమైన వీరగాథ. పైగా ఇది సాహిత్యమూల్యం కూడా సంతరించుకొన్నది.

మూడవది 'నేను-నా దేశం' అను పేరుతో గదర్ వీరుడు దర్శి చెంచయ్యగారు వ్రాసుకున్న స్వీయ చరిత్ర 'పోయిన అర్ధ శతాబ్దిలో మనదేశంలో ఆర్థిక, సాంఘిక, రాజకీయ, సాంస్కృతిక రంగాలలో వచ్చిన ప్రతి మహోద్యమం దర్శి చెంచయ్యగారి జీవిత దర్పణం మిగిల్చింది' అని టీకా కర్తలన్న మాట అక్షరాలా నిజం. అటు నాయకుడూ కాక, ఇటు అనుచరుడూ కాక, ముక్కుకు సూటిగా పోయే తనకు తోచిన ఉద్యమంలో పాల్గొన్న చెంచయ్యగారి ఆత్మకథ ఉత్సాహకరమైంది. తమ స్వీయచరిత్రకు ప్రస్తావన వ్రాస్తూ "మనదేశ మహోద్యమానికి మకుటప్రాయమయిన గాంధీ మహాత్ముని జీవితచరిత్ర తెలుగున వచ్చి నాపటిపాయ్యారు. అంతగొప్ప ఆత్మకథ తరువాత నేను వ్రాయడమేమిటని నాలో నేను నవ్వుకున్నాను. కాని ఆ మహోద్యమంలో మహాత్ముని జీవితమెంత అగ్నికుండమైతే నా సమిధా అందులో కాలు లేక పోలేదు అన్న భావం మాత్రమే నన్ను ఈ రచనకు ప్రేరేపించింది" అని చెంచయ్యగారు చెప్పుకున్నారు. భారతదేశం పరాధీన స్థితినుంచి బయటపడవలెనన్న కాంక్ష నాటి దేశభక్తులలో ఎంత బలీయంగా వుందీ ఇలాంటి విస్మృత వీరుల జీవిత చరిత్రలవల్ల తెలుస్తుంది.

డాక్టర్ కె యన్ కేసరిగారు 'నా చిన్ననాటి ముచ్చట్లు' అంటూ తమ పత్రిక గృహలక్ష్మిలోనూ, ఇతరత్రా కొన్ని వ్యాసాలు వ్రాశారు. అవే పుస్తక రూపంలో వెలువడ్డవి. డాక్టర్ కేసరిగారు రాజకీయ నాయకులు కారు. వైద్యులు. పత్రికా సంపాదకులు. సేవా పరాయణులు, వితరణ శీలురు. వైద్యరూపంగా, పత్రికా ముఖంగా, విదుషీమణులకు స్వర్ణ కంకణ బహూకరణ రూపముగా ఆయన స్త్రీలకు చేసిన సేవ సంస్మరణీయమయినది. మద్రాసులో మైలాపూరులోని కేసరివిద్యాలయం, త్యాగరాయనగర్‌లోని కేసరి ప్రాథమిక పాఠశాల ఆయన దాతృత్వానికి నిదర్శనాలు. దాదాపు రెండులక్షల రూపాయలు ప్రజాహితార్థ కార్యాలకు దానంచేసిన వదాన్యశిఖామణి. అంతేకాదు పండితులను గాయకులను సత్కరించిన కళాపోషకులు కూడా. ప్రాచీన కళా సంస్కృతుల పట్ల ఆదరాభిమానాలు గల వ్యక్తి డాక్టర్ కేసరిగారు.

పండితులూ, పరిశోధకులూ, యోగనిష్ఠాపరులూ అయిన వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 'ప్రజ్ఞా ప్రభాకరం' అను పేరుతో ఆత్మకథ వ్రాసుకున్నారు. మరి కొందరు పద్యరూపంలో తమ స్వీయచరిత్రలనూ స్వీయానుభవాలనూ వ్రాసుకున్నారు. తిరుపతి వేంకట కవులలో ఒకరైన శ్రీ చెళ్ళపిళ్ల వేంకటశాస్త్రిగారు 'కాశీక చర్య' ఈ సందర్భంలో సంస్మరించదగింది.

సాధారణ జీవిత చరిత్రకూ, స్వీయ చరిత్రలకూ ఒక భేదం వుంది ఒకరు మరొకరి జీవిత చరిత్ర వ్రాసేటప్పుడు అన్ని విషయాలు సమగ్రంగా లభించక పోవచ్చు కాని ఎవరి చరిత్రను వారే వ్రాసుకొన్న పక్షంలో సంగతులన్నీ సంపూర్ణంగా వివరించడానికి వీలుపడుతుంది అయితే స్వీయచరిత్రలో కూడా ఆత్మగుణాలనే వ్రాసుకొని దుర్గుణాలను, లోపాలను వెల్లడించడం జరుగక పోవచ్చు అయితే మన స్వీయచరిత్ర కారులు వారిలోపాలను చాలవరకు నిష్పక్షపాతంగా వెల్లడించారు. మహాపురుషులైన వారి చరిత్రలు అవశ్యం పఠనీయమైనవి అవి మనకు గతాన్ని తెల్పి, భవిష్యత్తును ప్రబోధించి, వెలుగు నీడల్లో కూడిన ఈ జీవయాత్రలో మార్గ సూచికలుగా ఉపకరిస్తాయి.

మన గద్యరచనలో స్వీయచరిత్ర విభాగం ఇంకా విస్తృతం కావడం అవసరం ఇంకా ఎందరో పెద్దల స్వీయచరిత్రలు వెలువడాలి ముఖ్యంగా పద్మభూషణ మాడపాటి హనుమంతరావు పంతులుగారు, గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు, తల్లావఝుల శివశంకరస్వామిగారు, విశ్వనాథ సత్యనారాయణగారి వంటి అనుభవజ్ఞులు సాహితీపరులు తమ స్వీయ చరిత్రలను వ్రాసి ప్రకటించాలి. ఆ స్వీయచరిత్రలు వెలువడడానికి వారి మిత్రులు ప్రోద్బలం చేసి, తద్వారా స్వీయచరిత్ర విభాగాన్ని మరింత సంపన్నం చెయ్యాలి.

# చతుర్ముఖులు

**శ్రీ ఆంగర సూర్యారావు**

**పాత్రలు:**

| | |
|---|---|
| గోపాలరావు | రామచంద్రకవి |
| కీర్తిశ్రీ | కమలాకరం |
| విశ్వనాథం | గణపతి |
| వెంకటసుబ్బయ్య | పాపారాయుడు |
| రంగమణి. | |

స్థలం: కళామంటపం

సమయం: రాత్రి 7 గంటలు.

హాలుమధ్య ఒక ద్వారం కనిపిస్తోంది. తలుపులు మూసివున్నాయి లోపలి నుంచి నృత్యంచేస్తున్నట్లు మువ్వల ధ్వని, పాట - తక్కువస్థాయిలో విని పిస్తున్నాయి హాలులో — సింహాసనం ఆకారంలోవున్న ఒక కుర్చీ, దాని ముందు అందంగా అలంకరించబడిన ఒక టేబిలు వున్నాయి టేబిలుకు కుడి వైపున మూడు కుర్చీలు వున్నాయి. కుడి వైపు నుంచి కీర్తిశ్రీ వస్తాడు. వయస్సు 35 సంవత్సరాలు. ఖద్దరు లాల్చీ, పంచె, భుజంమీద ఖద్దరు శాలువా-చూడగానే 'కవి' అని తెలుస్తుంది కీర్తిశ్రీ హాలు ఖాళీగా వుండడం చూసి నిరుత్సాహపడతాడు. ఒకక్షణం ఆలోచించి హాలుమధ్య వున్న ద్వారం దగ్గరకు వెళతాడు. చెయ్యి వెయ్య గానే ఒక్కసారిగా తలుపులు తెరుచు కుంటాయి ఉద్వేగంగా మువ్వలధ్వని, క్షేత్రయ్య పదంలోని చివరి చరణం వినిపిస్తాయి.

"...దేవరే వరుడు కావలెనని
భావజుని పూజ లొనరించిన
ఆ వనితపేరేమి సెల వీరా,
సిగ్గేల రేరా!"

లోపలినుంచి గణపతి వస్తాడు వయస్సు 18 సంవత్సరాలు. లాల్చీ, పరాయి వేసుకున్నాడు కాళ్ళకు మువ్వలు వున్నాయ్.)

గణపతి (కీర్తిశ్రీని పరీక్షగా చూస్తూ) ఎవరుమీరు?

కీర్తిశ్రీ నేను కీర్తిశ్రీని—విశ్వనాథం గారు వున్నారా?

గణ: మీ పేరు ఎక్కడో విన్నట్టుంది! (ఆలోచిస్తాడు)

కీర్తి (కేలిగా) ఆహా! దానికేముంది! వినేవుంటావు.

గణ (ఏదో జ్ఞప్తికి వచ్చినట్లు) మీరు పత్రికలలో ఏమైనా రాస్తూవుంటారా?

కీర్తి కవిత రాసేవాణ్ణి.

గణ అద్దదీ! అలా చెప్పండి. మిమ్మల్ని చూడగానే అమాంతంగా కవిగారని తెలిసిపోయింది. లోపలికి దయచేయండి

కీర్తి తీరికలేదు. యిప్పుడు నేను రాచకార్యంమీద తిరుగుతున్నాను.

గణ: కవులకు రాచకార్యాలేమిటి చెప్మా!

కీర్తి: అబ్బాయీ! నువ్వు చిన్నవాడవు. నీకు యీ పెద్ద విషయాలు తెలియవు ఇటువంటి సాహిత్య

రంగాన్ని మేం రాజకీయరంగానికి దగ్గరగా తీసుకువెళ్ళాం.

విశ్వనాథం (లోపలినుంచి) గణపతీ! గణపతీ!

గణ (ద్వారం దగ్గరకు వెళ్ళి) యిక్కడే వున్నానండి మీకోసం యెవరో వచ్చారు

విశ్వ (లోపలినుంచి) యిప్పుడెవరురా దిగబడ్డారు?

గణ (పేరు మర్చిపోయి) కీర్తి. కీర్తి

(విశ్వనాథం లోపలినుంచి వస్తాడు. తెల్లగా, లావుగావున్నాడు గుండ్రని ముఖం, గిరజాలు, గాస్కో లాల్చీ, పంచె—నాట్యాచార్యుడికి కావలసిన లక్షణాలన్నీ వున్నాయి వయస్సు 30 సంవత్సరాలు)

విశ్వ: (కీర్తిశ్రీని గుర్తించి చిరునవ్వుతో) ఓహో! మీరా కీర్తిశ్రీగారూ! ఎవరో అనుకున్నాను

కీర్తి: రామచంద్రకవిగారు రాలేదా?

విశ్వ లేదండీ నేనూ వారికోసమే చూస్తున్నాను

కీర్తి (రిస్టువాచీ చూసి) ఎంతో టైంలేదు ఏర్పాటులు యింకా పూర్తికాలేదు నేను వెళ్ళి రామచంద్రకవిగార్ని తీసుకువస్తాను (కుడివైపు వెళుతూవుంటాడు)

విశ్వ కీర్తిశ్రీగారూ! చిన్నమాట! (కీర్తిశ్రీని సమీపించి) గోపాలరావుగారివంటి సుప్రసిద్ధ నాయకుడు మీ రచయితల సమావేశానికి వస్తున్నందుకు నాకు చాలా సంతోషంగావుంది

కీర్తి: (ప్రసన్నుడై) మీవంటి సహృదయులకు సంతోషంగానే వుంటుంది (కోపంతో) కాని . వుంటారు చూడండి కొందరు

విశ్వ పోనిద్దురూ! వాళ్ళ మాటలను పట్టించుకుంటే మనం క్షణంసేపు మర్యాదగా బ్రతకలేం

కీర్తి మీరేదో చెప్పబోయి మానేశారు

విశ్వ అహా! మరేంలేదు యీ సమయంలోనే గోపాలరావుగారికి నాపేరు కొంచెం సిఫారసు చేయించాలి

కీర్తి: తప్పకుండా చేయిద్దాం మన రామచంద్రకవిగారు యెంత చెబితే అంత దానికి తిరుగులేదు

విశ్వ మీరు నలుగురూ కలిసి నాటక సంఘంలో నాపేరు పడేలా చూడాలి

కీర్తి తప్పకుండా మాద్దాం. యిప్పుడే వస్తాను (కుడివైపు వెళ్ళిపోతాడు)

విశ్వ (ఆలోచిస్తూ) యిది మంచి సమయం

గణ దేనికండి?

విశ్వ గోపాలరావుగారిని మంచిచేసుకునేందుకు

గణ ఆయన్ని మంచిచేసుకోవడం యెందుకు?

విశ్వ ఈనాడు కళారంగం అంతా ఆయనచేతుల్లో వుంది ఆయన తలుచుకుంటే యేమైనా చెయ్యగలరు

గణ అయితే మన నర్తకులను ఆహ్వానించండి. నేను నాలుగు జావళీలను అభినయించి చూపిస్తాను

విశ్వ నువ్వు అభినయిస్తే లాభంలేదు — సర్వాంగశోభితురాలైన, సింహమధ్యము అయిన లలనామణి కావాలి

గణ అటువంటి నర్తకి యిప్పుడు యెక్కడ దొరుకుతుందండి?

విశ్వ అదే ఆలోచిస్తున్నాను మంచి చిక్కువచ్చిపడింది గోపాలరావుగారిని ఆహ్వానిస్తాం బాగానే వుంది కనీసం ఒక శిష్యురాలిద్వారా ఆయనకు పూలమాల సమర్పించాలి

గణ (గుండెలమీద చెయ్యి వేసుకొని) నేను స్వయంగా సమర్పిస్తానండి.

విశ్వ (కోపంతో) పూజకోనోయ్ అందుకు నువ్వు పనికిరావు

గణ (నిరుత్సాహపడి) అదేమిటండీ? నాకేంలోటు?

విశ్వ (నిరుగ్గా) నీకేం లోటులేదురా నాయనా!— కానీ ఆడివాళ్ళద్వారా సమర్పింప చెయ్యడం ఒక ఫ్యాషన్

గణ యింత ఆకస్మికంగా శిష్యురాలు యెలా దొరుకుతుందండి?

విశ్వ యిదివరకు కోమల, కల్పవల్లి వుండేవారు. వాళ్ళు వుంటే ఈ బాల్లో

గణ (మనస్సులో అనుకొని) వాళ్ళు యిప్పుడు గోపాలయ్యగారిదగ్గర నేర్చుకుంటున్నారండి

విశ్వ ఆ గోపాలయ్య మన ప్రాణానికి యముడులా తయారయ్యాడు.

గణ ఆయనదగ్గర చాలామంది నేర్చుకుంటున్నారండి.

విశ్వ  యీ రోజుల్లో ధాబా, దర్పం కావాలి. విద్య చూపే వాళ్ళులేరు అందుకే గోపాలయ్యలాంటి వాళ్ళు కిలాడులే అవుతున్నారు గోపాలయ్యని మించిపోవాలంటే నాకు ఒకటే ఉపాయం తోస్తోంది.

గణ  యేమిటండీ అది?

విశ్వ : నాటక సంఘంలో స్థానం సంపాదించడం

గణ : దానివల్ల లాభం యేమిటండీ?

విశ్వ  అంతా లాభమే. ఎక్కడకు వెళ్ళినా రాజ కీయాల్లో వెళ్ళొద్దు మనమీద "సుప్రసిద్ధ నాట్యాచార్యాగ్రణి" అనే ముద్ర అమాంతంగా పడిపోతుంది యీ రోజుల్లో మనకు కావ్సిన విద్యకంటే ముద్రపడడం అత్యంతముఖ్యం అర్థ మయ్యిందికదూ? ఒకేఒక్కసారి ముద్ర పడిం దనుకో—యిహ దానికి దస్తీ తిరుగుండదు

(చివరిమాట అనే సమయంలో కుడివైపునుంచి వెంకటసుబ్బయ్య వస్తాడు సిల్కు చొక్కా గాస్కా పంచె, వేళ్ళకు ఉంగరాలు—ధనవంతుడని తెలుస్తుంది చేతిలో లెదర్ బాగ్ వుంది)

వెంకటసుబ్బయ్య (వస్తూనే) యేమిటండోయ్ విశ్వనాథంగారూ తిరుగు లేదంటున్నారు?

విశ్వ  ఓహో! వెంకటసుబ్బయ్యగారా! యేమిటి—యెప్పుడూ లేనిది యిలా దయచేశారు?

వెంక  యిక్కడ రచయితల సమావేశం వుందటకదూ! కాస్సేపు కూర్చునిపోదామనివచ్చాను యింకా యెవరూ రాలేదా?

గణ  (ఆశ్చర్యంగా చూస్తూ) మీరు సిల్కుష్టోర్సు ప్రొప్రయిటర్ గారు కదండీ?

వెంక  (గణపతి కేసిచూసి) అవును. (విశ్వనాథంతో) యీ కుర్రా డెవరండీ?

విశ్వ : వీడు నా శిష్యుడు గణపతి యీ పూటే రేపు నాట్యాచార్యుడిగా నా శిష్యుడితో సమాన స్థాయిలో నాట్యం చెయ్యగలుగుతాడండి చూద్దాం

వెంక . మంచి శిష్యుణ్ణే సంపాదించారు.

విశ్వ : సంపాదించడం కాదండీ—తయారుచేశాను.

గణ : (ఆశ్చర్యంతో) సిల్కుష్టోర్సు ప్రొప్రయిటర్ గారికి రచయితల సమావేశానికి సంబంధం యేమిటా అని నా సందేహం!

విశ్వ  (గణపతి కేసి కోపంగా చూస్తూ) ఉష్! ఊరుకో! (వెంకటసుబ్బయ్యతో) చూడండి వెంకటసుబ్బయ్యగారూ! మీ వంటి కళా ప్రభువుల సహకారం లేనిదే యే సంస్థా బ్రతకలేదు.

వెంక  అవి వెనకటి రోజులు యిప్పుడు మనుష్యుల్ని కత్తిలో పెట్టి కొక్కే కాలమండీ కూర్చుంటే పన్ను! నుంచుంటే పన్ను! సినిమాచూస్తే పన్ను! కారెక్కితే పన్ను! చివరకు కాలం చేసినా పన్ను వేస్తున్నారు దానధర్మాలమీద కూడా పన్నువేశారుకదా!

విశ్వ  మీరు చెప్పింది నిజమే అనుకోండి మీలాంటి వారు మనుష్యుల్ని కొంచెం ఆదుకోవాలి

వెంక  అయిదు రూపాయలు దాటి చందా యిస్తే మా ఆడాళ్ళు ఒప్పుకోరు ఆ అయిదురూపాయలకైనా చచ్చి చెడి ఒప్పించాను.

విశ్వ  మీ దయ!

వెంక  మీ శిష్యుణ్ణి—ఓ రెండు నిముషాలు—విడిచి పెట్టగలరా?

విశ్వ  అలాగే తీసుకు వెళ్ళండి నాకూ తొందరపనులు వున్నాయి నా సభ్యత్వం సంగతి సిద్ధయింద కలిసిన రోజు యిది (ముఖద్వారంలోనుంచి వెళ్ళిపోతాడు.)

వెంక  (గణపతిని ఒక ప్రక్కకు తీసుకువెళ్ళి) అబ్బాయ్ నీకు హేండ్ కెమెరాతో ఫోటోలు తియ్యడం వచ్చునా?

గణ  (సంతోషంలో) ఓ! అద్భుతంగా తీస్తాను నేను స్నాప్‌షాట్సు తియ్యడంలో ఎక్స్‌పర్టును.

వెంక  యిదివరకు యెప్పుడైనా తీశావా?

గణ  బోలెడు తీశాను—ఓసారి సుందర వేణి గార్డెన్ ప్రక్కనుంచి వస్తోంది. అప్పుడు నేను ప్రిన్సిపాల్ గారి రూం దగ్గర వున్నాను. చూశాను. వెంటనే స్తంభం వెనక్కి వెళ్లాను. జేబులోంచి చిన్న కెమెరా తీసి ఒకటిఒక స్నాప్ షాట్ .

వెంక  (నవ్వుతూ) యిహ నేం! నీకు బాగా తెలుసు.

విశ్వ పదం! పదం! ఆలస్యం చేస్తే కొంపమునిగిపోతుంది. (విశ్వనాథం గణపతి కలిసి ఆ మెను లోపలికి పంపి తలుపుల దగ్గరకు వెళ్తారు యిద్దరూ ఒకరికేసి ఒకరు విచారంగా చూసుకొని—యేమీ తెలియక అట్లు వుండిపోయి చూస్తూవుంటారు రామచంద్ర కవి, శ్రీశ్రీ, కమలాకరం మాట్లాడుకుంటూ కుడి వైపునుంచి వస్తారు రామచంద్రకవి సిల్కు లాల్చీ, గ్లాస్కో పంచె కట్టుకున్నాడు భుజం మీద శాలువాలాంటి వుంది ముఖం ప్రశాంతంగా వుంది చిరునవ్వు నవ్వుతూ మాట్లాడ్డం అలవాటు వయస్సు 60 సంవత్సరాలు— కమలాకరం సన్నంగా, పొడుగ్గా వున్నాడు. కళ్ళు లోతుకుపోయి వున్నాయి. పలికిపోయిన పరాయి, పొట్టిచేతుల చొక్కా—జుత్తు చిందరవందరగా వుంది వయస్సు 40 సంవత్సరాలు.)

రామచంద్రకవి (కమలాకరంతో) మీరు చెప్పింది నిజమే! అతను పండితుడే కావచ్చు—ఎవరు యే మంచిపని చేసినా విమర్శించే స్వభావం అతనిది.

కమలాకరం వారిని ఆహ్వానించినంతమాత్రాన నష్టమేముందండి?

శ్రీశ్రీ అంతా వస్తుంది! అనుకున్నది అనుకున్నట్లు జరుగుతూవుంటే మీరేం చెయ్యగలరు!

రామ : కమలాకరంగారూ! వారి సంగతి మాకు పూర్తిగా తెలుసు వారితో కలిసి యిరవై సంవత్సరాలు పనిచేశాం

శ్రీ ఆయన కొందరు అభిమానధేయుల్ని చేరదీసి ఒక ముఠా కడుతూవుంటాడు

కమ వారిలో చాలా మంది రచయితలు వున్నారన్న విషయం మనం ఒప్పుకోవాలి

శ్రీ అవును ఉన్నమాట వాస్తవమే కాని వారి నందరినీ యిప్పుడు ఆహ్వానిస్తే యీ సమావేశం రసాభాసమవుతుంది,

కమ : (ఆశ్చర్యంతో) రచయితల నందర్నీ విడిచిపెట్టి యీ సమావేశానికి యెవర్ని ఆహ్వానించినట్లు?

శ్రీ : కమలాకరంగారూ! ఆ విషయాలన్నీ మన కెందుకు? చెప్పినారు—రామచంద్రకవిగారి నిర్ణయానికి విడిచి పెట్టడం శ్రేయస్కరం.

రామ : అటువంటి గొప్పవాళ్ళను, నాయకులను ఆహ్వానించినప్పుడు సభ ప్రశాంతంగా వుండాలి గందరగోళం జరగకూడదు

కమ : రామచంద్ర కవిగారూ! మీరు అన్యథా భావించకపోతే నా అభిప్రాయం చెబుతాను

రామ చెప్పండి

శ్రీ : దానికేం చెప్పండి. మనలో మనం అన్ని విషయాలూ కూలంకషంగా చర్చించుకోవడం మంచిది

కమ సాహిత్య సభలకు రాజకీయ నాయకులను ఆహ్వానించడం మంచిది కాదని నా నమ్మకం

శ్రీ మీ ఉద్దేశం?

కమ సాహిత్య రంగంలో ప్రవేశం లేని వారు యేం మాట్లాడతారు? వారి స్వీయాభిప్రాయాలు వినడానికి చాలా సహనం కావాలి

రామ గోపాలరావుగారు అందరు నాయకులవంటి వారు కారు ఆయన కొన్ని పుస్తకాలు రాశారు సంగీతం, నృత్యం మొదలైన కళలతో కూడా ఆయనకు అపారమైన పరిచయం వుంది

కమ : అయితే సాహిత్యాన్ని రాజకీయ ప్రయోజనాల కోసం వుపయోగించుకోరంటారా?

రామ మేం అందరం వుండగా అటువంటిది జరగనివ్వం

విశ్వ (రామచంద్ర కవిని సమీపించి) నమస్కారం.

రామ (నమస్కారం అందుకొని) ఏమిటి విశ్వనాథం గారూ మనవాళ్ళు యెవరైనా వచ్చారా?

గణ (కలగజేసుకొని) చాలా మంది వచ్చారండి పెద్ద పెద్ద పత్రికలు, అధికారులూ, చాలామంది గొప్ప వాళ్ళంతా (ఎడమవైపు చూపిస్తూ) ఆ వరస కుర్చీలలో కూర్చున్నారు వాళ్లే వినుక విలువడం వాళ్ళంతా పెనాలే బంట్రోతులూ, కాదు కైతయూను.

రామ (శ్రీశ్రీతో) టీ ఎక్కడ యేర్పాటు చేద్దాం.

శ్రీ (ఎడమవైపు చూపిస్తూ) ఆ హాలు బాగా వుంటుంది.

రామ (విశ్వనాథంతో) మీ వర్తకాలలో యేర్పాటు చెయ్యి?

విశ్వ : (యేం చెప్పాలో తోచక) యిక్కడ అతక .

గణ : (వెంటనే అందుకొని) అంత బాగా వుండదండి.

రాము: ఒకసారి లోపలికి వెళ్ళి చూద్దాం. (గదిలోకి వెళ్లబోతాడు)

విశ్వ: (భయంతో) వద్దండి. వద్దండి

కీర్తి (ఆశ్చర్యంతో) యేం?

గణ (ముందుకు వచ్చి) అన్నీ సామాను చిందర వందరగా అస్తవ్యస్తంగా వున్నాయండి ఇంకా యేమీ సర్దలేదు

కీర్తి అటువైపు హాలు బాగానే వుంది అక్కడ పార్టీ యేర్పాటుచేద్దాం తరవాత సమావేశం యిక్కడ జరుపుకోవచ్చు

(కీర్తి కి ముందు—వెనక రామచంద్రరావు, కమలాకరం ఎడమవైపు వెళుతూ వుంటారు)

విశ్వ రామచంద్రరావుగారూ!

(రామచంద్రరావు ఆగి వెనక్కి తిరిగి చూస్తాడు కీర్తి, కమలాకరం నిష్క్రమిస్తారు)

రాము: ఏమిటో త్వరగా చెప్పండి

విశ్వ: నా మాట మరచిపోయారా?

రాము దేన్నిగురించి?

విశ్వ నాటకసంఘంలో నా సభ్యత్వంగురించి

రాము ఆహా! ఆవిషయం నేనుమరిచిపోలేదు నాటికా తయారుచేసేటప్పుడు నేను దగ్గరే వుంటాను

విశ్వ మీ మేలు మరచిపోను నాటకసంఘంలో నేను మీ సిద్ధాంతాలకు అనుకూలంగా నడుచుకుంటాను.

రాము తరవాత స్థిమితంగా మాట్లాడతాం (వెళ్లిపోతూ వుంటాడు)

విశ్వ: మరో చిన్న మనవి

రాము: నాకు టైం లేదు త్వరగా చెప్పండి.

(రంగమ్మ ఆకస్మికంగా తలుపులు తెరిచి ద్వారం దగర నిలబడుతుంది)

రంగ: (చిరాగ్గా) అబ్బబ్బా! యేంటీ పాడ.

(ఆమెను చూసేగానే విశ్వనాథం, గణపతి కంగారుపడతారు గణపతి ఆమెను లోపలకు నెట్టి తలుపు దగ్గరకు వేస్తాడు)

రాము ఆవిడ యెవరు?

గణ: ఆవిడ మా గురువుగారి...

విశ్వ (అమాంతంగా మధ్యలో అందుకొని) శిష్యురాలు లెండి

రాము అలా వుందేం?

గణ జానపద నృత్యంకోసం వేషం వేయించామండి (గణపతి తలుపు గట్టిగా పట్టుకొని నిలబడతాడు)

విశ్వ రామచంద్రరావుగారూ! మీరు నాకు మరో చిన్న సహాయం చెయ్యాలి

రాము చెప్పండి

విశ్వ గోపాలరావుగారు మీమాటకు ఎదురు చెప్పరు.

రాము అతనికి నామీద గౌరవభావం వుంది సాధారణంగా నేను చెప్పింది కాదనరు

విశ్వ: మరేమీ లేదు మీరచయితల సమావేశం ముగియగానే వారు నా వస్తువులకు వచ్చే యేర్పాటు చెయ్యాలి

రాము చెబుతాను.

విశ్వ చెప్పడం కాదు తమరు తప్పకుండా ఏర్పాటు చెయ్యాలి!

రాము మా సమావేశానికి మీరు కూడా వస్తారుగదూ అప్పుడు మాటాడదాం (ఎడమవైపు నిష్క్రమిస్తాడు)

గణ ఈతలుపు పట్టుకోలేక నా ప్రాణం పోతోంది లోపల్నుంచి ఆమె ఉడుం పట్టు పట్టి లాగుతోంది

విశ్వ యిదెక్కడి ఖర్మ వచ్చి పడిందిరా!— యీమెను వెంటనే యిక్కడినుంచి పంపించకపోతే మన మర్యాద దక్కదు.

గణ ఆమె మర్యాదగా వెళ్లిపోతుందన్న ఆశ నాకు యేకోశానా లేదు

విశ్వ యిప్పుడీ అపాయంనుంచి తప్పుకోవడం యెలాగరా నాయనా?

గణ: (ఆకస్మికంగా) నాకో అద్భుతమైన ఉపాయం తోచిందండి

విశ్వ యేమిటో వేగం చెప్పితగలడు! గోపాలరావుగారు వచ్చే సమయానికి యీమెను పైకి పంపించాలి.

గణ: ఎక్కడికీ పంపనక్కర్లేదు.

విశ్వ: ఎక్కడైనా దాచేద్దామంటావా?

శాస్త్రి : (కోపంగా) రేపటినుంచి ఇతనిని కూడా మనం దూరంగా ఉంచాలి.

(రామచంద్ర కవి, శాస్త్రి, వెంకటసుబ్బయ్య, పాపారాయుడు ఎవరువాళ్ళు వెళ్ళిపోతారు. విశ్వనాథం గణపతికి సైగ చేస్తాడు. గణపతి గది లోకి వెళ్ళిపోతాడు)

విశ్వ ఇదే నా వరహాలు! తలుపు

(గోపాలరావు లేస్తాడు. వెంటనే గది తలుపులు తెరుచుకుంటాయి. దర్జాగా అలంకరించుకొని, తనుగుమ్మంతో — రెండు చేతులతో పూల మాల పట్టుకొని రంగమ్మ ప్రవేశిస్తుంది. ఆమె రూపంలో గుర్తించలేనంత మార్పు వచ్చింది. ఆమెను ఒక క్షణమయినా విడిచిపెట్టకుండా — అంగరక్షకుడిలా — గణపతి ఆమె వెనకే తిరుగుతూ వుంటాడు. ఆమె ఎటు అడుగు వేస్తే తనూ కూడా అడుగు వేస్తూ వుంటాడు. గోపాలరావు ఎటు చూస్తే విశ్వనాథం కూడా అటే చూస్తూ ఉంటాడు)

గోపా (సంతోషంతో) అమ్మ! కళలంటే ధరణి నాట్యంమీద నాకు అభిమానం ఎక్కువ (రంగమ్మను సమీపిస్తాడు) ధీర నారీమణి అన్న పద్దతి ఈ మెను మూసే చేసివుండాలి

గణ అద్భుతంగా సెలవిచ్చారు

(రంగమ్మ గోపాలరావుకు దండ ఇవ్వబోతుంది. అతను దండ తీసుకోకుండా ఆమె ముఖంలోకి చూస్తుంటాడు. రంగమ్మ వెనక్కి అడుగు వెయ్యబోతుంది. వెంటనే గణపతి ఆమె చేతి లోని పూలమాల తీసుకొని అతనికి వేస్తాడు)

గోపా విశ్వనాథం గారూ! మీ శిష్యురాలికి భయం ఎక్కువ అనుకుంటాను.

విశ్వ చిత్తం! తమవంటి పెద్దలదగ్గర మాలాంటి ఆరి తేరినవాళ్ళకే భయంగా వుంటుంది.

గణ అందులోను ఈ భయం వుంది చూశారూ! ఇది సిగ్గుకు సంబంధించినది.

గోపా స్త్రీలకు సిగ్గు సహజమైన ఆభరణం కదండీ.

విశ్వ చిత్తం

గోపా (రంగమ్మతో) ఇలా రా అమ్మాయ్ నీ పేరేమిటి?

గణ (వెంటనే అందుకొని) "రంగమణి" అండి.

గోపా రూపానికి, విద్యకు తగినపేరు. పేరు దర్జాగా వుంది. ఈమెకు 'నాట్యమణి' అని బిరుదు ఇస్తున్నాను.

గణ : (ప్రశంసిస్తూ) ఓహోహో! ఏం దర్జాని బిరుదు!

విశ్వ తమరి కళాహృదయం!!!

గోపా (జేబులోంచి సెంటుబాటిల్ తీసి) రంగమణీ! ఇదిగో! నేను ఈ సెంటుబాటిల్ బహూకరిస్తున్నాను (రంగమ్మ చేతికి ఇవ్వబోతాడు. రంగమ్మ తీసుకోకుండా వెనకకు అడుగు వేస్తుంది. ఆమె వెనుకనుంచి చెయ్యిచాచి గణపతి సెంట్ బాటిల్ తీసేసుకుంటాడు)

విశ్వ : (ప్రశంసిస్తూ) ఏంతరికి — ఏ సమయంలో — ఎటువంటి బహుమతి ఇవ్వాలో — తమకు అంతా తెలుసు!

గోపా (రంగమ్మకు దగ్గరగా వెళ్ళి) ఏదీ! ఒక పాట పాడి వినిపించు.

విశ్వ (వెంటనే అందుకొని) ఆర్కెస్ట్రా లేనిదే పాట పాడలేదండి.

గణ తమకు ఏ పాట కావాలో సెలవివ్వండి సార్! నేను పాడి వినిపిస్తాను.

గోపా (కోపంతో) ఇతడెవరు?

విశ్వ నా శిష్యుడేనండి. ఈ వూళ్ళో కాలి గజ్జెలు కట్టగలిగిన వాళ్ళంతా ఎప్పుడో ఒకప్పుడు నా దగ్గర నాట్యం నేర్చుకున్న వాళ్ళేనండి.

గోపా ఆర్కెస్ట్రా లేకుండా సహజమైన కంఠస్వరంతో మీ శిష్యురాలితో ఒక పాట పాడించండి (కుర్చీ రంగమ్మవైపు తిప్పి తీవిగా కూర్చుంటాడు)

గణ (ముందుకువచ్చి కెమేరా పైకెత్తి) తమరు అలాగే కూర్చోండి. రంగమణిగారూ! మీరు కూడా ఇటు .

(రంగమ్మ గణపతి కేసి ఉరిమిచూస్తుంది.)

విశ్వ (రంగమ్మకు నోరు తెరవద్దని సైగ చేస్తాడు. గోపాలరావుతో) తమరు ఈసారి వచ్చేటప్పుడు ముందుగా నాకు తెలియజేస్తే ..

గణ (ముసుగుని ఫోటో తీసి వెంటనే అందుకొని) బ్రహ్మాండమైన నాట్యప్రదర్శనలు యేర్పాటు చేస్తామండి.

విశ్వ : యిరవై మంది శిష్యురాండ్రతో ఒకేసారి అడుగు, తాళం తప్పకుండా నృత్యం చేయిస్తానండి.

గణ అది సర్కస్ కంటే అందంగా వుంటుందండి.

గోపా: ఆ విషయం తరవాత ఆలోచిద్దాం. (రంగనతో ) నీకు సర్వత్రా రాణించగల ప్రత్యేకించి నర్తకీమణులకు, నటీమణులకు నీకు అపకారం చేస్తుంది —ఏది! ఒక్క చిన్న పాట పాడి వినిపించు.

శేషన్యంలో సార్ ! చెల్లగాం !!

గణ (వెంటనే కుడివైపు వెళ్ళి, చిన్న కత్తి తీసుకొని వస్తాడు చిరునామా చూసి) తిరుక్ సార్ !

(గోపాలరావు కవరు చింపి చూశాడు. కోపంతో అతనిముఖం యెర్రబడుతుంది గణపతి, విశ్వనాథం అతనికి చెరోవైపు నిలబడి ఆత్రుతతో చూస్తూవుంటారు )

గోపా (లేచి) నేను అనుమానించినంతా జరిగింది. (కోపంతో) అవిశ్వాసం !—అవిశ్వాసం !!

(గోపాలరావు తొందరగా కుడివైపు నడుస్తూ వుంటాడు. రామచంద్రరావు, కీర్తి యెదురుగా వైపునుంచి వస్తారు )

రాము (గోపాలరావు వెళ్ళిపోతూవుండటం చూసి తొందరగా) వెళ్ళిపోతున్నారా? మా విషయం .

గోపా: (కన్నెలో అందుకొని) యిప్పుడు తీరిక లేదు పోస్టులో పంపండి చూస్తాను.

(గోపాలరావు విరవిరా కుడివైపు వెళ్ళిపోతాడు. అతని వెనుక రామచంద్రరావు, కీర్తి వెళ్ళిపోతారు )

రంగ (చేతులకున్న ఆభరణాలు జాగ్రత్తగా తీసిపారేస్తూ కోపంతో) సిగ్గూ యెగ్గూ లేకుండా నన్ను వలువుగట్లోనూ నిలబెడతారా ? మీపని పడతా నుండండి (అలంకారాలన్నీ తీసేస్తూవుంటుంది )

గణ : రంగమ్మా ! కదలకుండా మా గురువుగారి ప్రక్కను నిలబడు మీ యిద్దరినీ ఒక ఫోటో తీసేస్తాను.

రంగ (కోపంతో) యేం ? యెలాగుండేంటి ?

(గణపతిమీదికి రాబోతూ వుంటుంది విశ్వనాథం ఆమెను పట్టుకోబోతూ వుంటాడు ఆ సమయంలో గణపతి వెనుకకు అడుగు వేసి యిద్దరినీ ఫోటో తీస్తాడు సరిగా ఫోటో తీస్తున్న సమయంలో ఎడమవైపునుంచి వెంకటసుబ్బయ్య , పాపారాయుడు వస్తారు )

వెంక (అమాంతంగా గణపతి చేతిలోని కెమేరా లాక్కొని) ఫలుమంతా దంచుకుచేసేగావు

పాపా గోపాలరావుగారేరీ ?

విశ్వ ఏదో అర్జంటు పనిమీద వెళ్ళిపోయారు అదేం రాజకీయమా !

వెంక అరరే! అప్పుడే వెళ్ళిపోయారా ?

పాపా పదండి ! బంగాళాకెల్దాం

(వెంకటసుబ్బయ్య పాపారాయుడు తొందరగా కుడివైపు వెళ్ళిపోతారు )

గణ యిది మన వర్తకాల చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించదగిన రోజు !

రంగ (కోపంతో ) వుండుండు ! నీపనయిపోలేదు లే !

(రంగమ్మ గణపతిమీదికి వస్తూవుంటుంది. గణపతి ఒక్క దూకుదూకి యెడమవైపు నిష్క్రమిస్తాడు రంగమ్మ ధూమధూమగా యెడమవైపు నడుస్తూవుంటుంది విశ్వనాథం అలిసిపోయిన వాడిలా కుర్చీలో కూలబడతాడు.

[ తెర ]

# జాతక శాస్త్రప్రయోజనము

శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు

రమారమి ఇరువది యేండ్లకు పూర్వము ఒకప్పుడు నేను కార్యార్థమై బెంగుళూరునగరమునకు పోయి అచట నా మిత్రుని యింట విడిసియుంటిని. ఉత్తర దేశమునుండి ఒక గొప్ప జ్యోతిష్కుడు తీర్థయాత్రలు సలుపుచు వచ్చి కొలది దినములు ఆ నగరములో ఒక సంపన్న గృహస్థుని యింట విడిసియున్నాడని ప్రస్తావవశమున నా మిత్రుడు నాకు తెలిపెను. వ్యాపారముగా దేశసంచారము చేయు జ్యోతిష్కుల వంటి వాడు కాడనియు, అడిగినవారికి ఉచితముగ, జాతక ఫలమో, సులభ చిట్కాలో అతడు సూచించుననియు, దీనిచే అతనిని చూడవలయునని సంకల్పించితిని. జాతకశాస్త్రమును గురించి అతని అనుభవవిశేషము లెట్టివో, ఏ పద్ధతి నతడు అవలంబించుచుండెనో, దైవ పురుషకారముల పరస్పరసంబంధమును గూర్చి అతని యూహలు, అనుభవము లెట్టివో, నూతన గ్రహముల ఫలములపై అతని దృష్టి యేపాటిదో, మున్నగు సమస్యలను గూర్చి అతనితో చర్చించుట లాభకారి యగుననుకొంటిని. జ్యోతిషమే జీవనోపాయముగా పెట్టుకొన్నవారు ఇట్టి చర్చలతో కాలయాపనము చేయుటకు ఒప్పుకొనరని పాఠక మహాశయులు సులభముగా గ్రహింపగలరు.

ఆమరునాటి ఉదయమున ఎనిమిది గంటలకు నేనును, నామిత్రుడును, ఆ జ్యోతిషుడున్న గృహస్థుని ఇల్లు చేరితిమి. ఆ ఇంటి వసారలోని చిన్న గదిలోనే ఆ జ్యోతిషుని బస. ఆగదిలో అర్ధభాగమునకు ఒక చిన్న తెర వ్రేలగట్టి, లోపల అతడేదో పనిలో నుండెను. గదివాకిట మేము నిలుచుకొన్నపాటి నిముషమునకు అతడు కొంచెముగా తెర ఓరచేసి, చూచి గదిలోపలికి వచ్చి కూర్చుండుడని చేసైగతో పిలిచెను. లోపలికేగి అందున్న చిఱుచాపపై మేము కూర్చుంటిమి. "[illegible] నిప్పులపై వేసినాను. త్వరలో వస్తాను" అని చెప్పి తన పని ముగించి, నిముషకాలములో వచ్చి మా యెదుట కృష్ణాజినముపై కూర్చుండి, వచ్చిన పని ఏమని ప్రశ్నించెను. మా సంభాషణ మంతయు ఆంగ్లభాషలోనే జరిగినది.

వంగదేశమునకు చెందిన దేహచ్ఛాయ, బ్రహ్మతేజస్సు తొణుకుచుండు ముఖవర్చస్సు, విభూతితో దిద్దబడిన మూడు తిర్యక్పుండ్రములతో నిగనిగలాడు విశాలఫాలము, సౌజన్యమును సూచించు గొప్ప నేత్రములు, విశాల భుజాంతరమున వ్రేలుచున్న తెల్లని ఉపవీతము, మోకాలి బంటిగా కట్టిన ధౌతవస్త్రము, కలిగి పద్మాసనమున ఆసీనుడైయున్న ఆ మహనీయుని చూచినవారికి, అతడొక ఉత్తమవంశసంజాతుడనియు, గొప్ప సంస్కృతి గల పండితుడనియు, తపస్సంపన్నుడగు యోగియనియు తోచకమానదు.

"మీరు గొప్ప జ్యోతిశ్శాస్త్రవేత్తలని, మిమ్ము దర్శనమునకై వచ్చితిని" అంటిని.

"జాతకము తెచ్చినారా?" అతని ప్రశ్న.

"నేను విద్యార్థిని, సందేహములను కొన్నింటిని మనవిచేయదలచితిని."

"సంతోషము కొంత విరామముగా కూర్చుంటిరేని, తెలిసినది చెప్పగలను."

అతని సౌజన్యమునకు సంతోషించితిని. ఒక్కొక్కటిగా నా సందేహములను చెప్పి, అతని ప్రత్యుత్తరములను బడయగలిగితిని. ముఖ్యముగా, పరాశర వరాహమిహిర, శ్రీపతి ప్రముఖుల సంప్రదాయమునే అతడవలంబించుచుండుట, జైమిని ప్రాచీన మహర్షులకు అభిమతమైన [illegible] పద్ధతితోనే ఫలములను గణించుట ఉపయుక్తమని సోపపత్తికముగా అతడు వివరించెను. నూతనముగా ఖగోళశాస్త్రజ్ఞులచే కనుగొనబడిన ఇంద్రవరుణులకు సయితము ఫలప్రదత్వము కలదని అనుభవము తెలుపుచుండుటచేత, జాతక మహార్ణవాదులలో వానిని

నిరాదరించుట శాస్త్రమునకు నష్టమనియు, పాశ్చాత్య పథిక గ్రంథములనుండి సాయన గ్రహగతులయొక్కయు సాయన లగ్నాది భావములయొక్కయు, స్థితిని గుర్తించుట సులభమార్గమనియు, ఏకమాత్రి ప్రయోగముగా సర్వజాతకములకును, వింశోత్తరీ దశానుకట్టి ఫలములు చెప్పుట శాస్త్రసమ్మతము కాదనియు, యవనులనుండి నేర్చుకొని, మన ప్రాచీన పండితులు అభివృద్ధిపరచియున్న తాజిక సంప్రదాయమందలి దృష్టి యోగములు, వర్షజాతకాదులు ఉపయోగించుట ఎంతో ప్రయోజనకారి యనియు, విపులముగా అతడుపన్యసించినాడు.

"దైవపురుషకారముల పరస్పరసంబంధ మెట్టిది? దైవము అనగా గ్రహగతి, దుష్టమైనప్పుడు, పురుషకారమేమి చేయగలదు" అని అడిగితిని

"ఇది చాల చిక్కు సమస్య. స్థూలముగా నిట్లు విశ్వసించవచ్చును. మంచిదైనా, చెడ్డదైనా దశలను నమ్మనుటకుగాని, రద్దుపరచుటకుగాని, మన కధికారము లేదు. వ్యక్తుల పూర్వకృత కర్మఫలమునకే దైవశక్తి అనిపేరు. అది ఈ జన్మమున ఏ కాలములో, ఏ స్వభావముతో, పక్వానకు రాగలదో, జాతకశాస్త్రము దశాదులద్వారా, మనకు సూచించగలదు. ఈ దైవశక్తి ప్రసారమును నిషేధించుటకు కాని, నిరోధించుటకు కాని పురుషకారమునకు సాధ్యము కాదు. అయినా, ఆ శక్తి ఏదో విధముగా పురుషకారము తోడుపడనిదే, ఫలము లేదనుట ముఖ్యసూత్రము. తన స్వభావముతో సరిపడు భావములు మనలో ఆశక్తి రగులుకొలిపి ఉద్రేకింపజేయును సాధారణముగా, ఆ భావములు మన హృదయములను ఏవైపునకు లాగునో, ఆ మార్గమునందే, తెలిసియో, తెలియకో, మనము పురుషకారమును చేయుచుందుము. అట్లని, ఆ భావములకు దాసులుగా ప్రవర్తించి తీరవలెనని నియమము లేదు. తగిన సంస్కారములవలన, వివేకమువలన ఇంద్రియముల నిగ్రహించి స్వాధీనములో నుంచుకొని, ఆ దైవశక్తి ప్రసారమునకు మార్గాంతరమును కల్పించవచ్చును. పురుషకారమున కనుగుణముగా దైవశక్తి ఫలము యొక్క స్వభావము భిన్నస్వరూపములతో గోచరించగలదు. అనగా, దైవశక్తి యొక్క స్వభావమును మార్పలేము కాని, దాని స్వరూపమును పురుషకారము మార్చగలదనుట. దైవపరిపాక ఫలము అనుభవించక తీరదు తగినరీతి ప్రవర్తించి దాని స్వరూపమును మార్చవచ్చును.

అవశ్యమనుభోక్తవ్యం,
కృతం కర్మ శుభాశుభం"

అను సిద్ధాంతమునకు, ఈ ఉపపత్తిచే ఏమియు బాధలేదు. శంకర భగవత్పాదాచార్యులు సన్యసించి మొసలిపట్టునుండి విముక్తినొందుట, కృష్ణదేవరాయలు రాజ్యత్యాగము చేసి ప్రబల కుహూయోగదుష్ఫలము తప్పించుకొనుట, మున్నగునవి ఈ సందర్భమున వెలలేని దృష్టాంతములు.

"సామాన్యజీవితము నుండి యొకచిన్న ఉదాహరణము చూచుచు. మండువేసవిలో, గాలియు సంచారములేని దినములలో, దుర్భరమగు తాపములో కంటికి నిద్ర అంటక బాధపడుదుముకదా? ఈ అననుకూల పరిస్థితి తగ్గించుకొనుటకై విద్యుచ్ఛక్తితో తిరుగు పంకాకై దానికి రెండో మూడో వందల రూప్యములకు కొనితెచ్చి ఉపయోగించుకొంటిమేని, ఆ బాధ కొంత తగ్గించుకొనగలము. ఈ ఉదాహరణములో మనము చేసిన కార్యమునకు అర్థమేమి? ఒకరకపు బాధ తగ్గించుకొనుటకై, మరియొకరకపు బాధను ఓర్చుకొన్నాముకదా! ఆ రెండు మూడు వందలు సంపాదించుటకొరకు అనుభవించవలసిన కాయిక మానసిక పరిశ్రమలవలని క్లేశమును అంగీకరించి వేసవి బాధను తగ్గించుకొనుటే కదా ఇదికి విమర్శించి చూచితిమేని, దుష్టదశాకాలపు ఫలమును తగ్గించుకొనుటకై శాస్త్రము విధించిన జపతపములు, దానధర్మములు పూజాప్రయోగములు, మున్నగునవి, అన్నియు, ఇట్టి తత్త్వముపైన ఆధారపడినవే. ఇట్టి యుక్తితో, సందర్భానుసారముగా, దైవఫలస్వరూపమును మార్చి కొంతలో కొంత హితకరముగా అనుభవించుటకు వీలున్నది. కాని, దీనికి గొప్ప సంకల్పశక్తి, మహత్తరసంస్కారము, కావలసియున్నది"

అని ఉపన్యసించి అతడు మౌనమూనెను. అతని సమన్వయశక్తి చాలా రమ్యముగా నుండెను. సంతోషించితిని.

"ఈ విషయమున తమ అనుభవము ఉన్నచో, వినుటకు కుతూహలము కలదు" అంటిని.

# జాతక శాస్త్రప్రయోజనము

“అతిశయోక్తిగా కనబడును. ముందుముందు రానున్న దశావ్యత్యాసమును గమనించి, దానికి ఏ వ్యయాపమున్నదో హితవా, ఊహించి, తగినటి పురుషకారము జాగ్రత్తే జాతకాభ్యాసము చలికాలము రానున్నదనగా, ఉన్నిగుర్తుల పిదప చేసుకొనుము కదా? దైవము తెలుసుకొనుటకై పురుషకారము చేయు సహాయము ఇదికాక మరియేమి? జాతక శాస్త్రమువలన మనకు కలుగు ప్రయోజనమింతే. భవిష్యత్తులో ఎప్పుడేమి జరుగనున్నదో, ముందుగా తెలుసుకొని, దానిని అనుభవించుటకు సన్నద్ధులమై కాని కాచుకొని యుండవలెనని కాదు. నా ఇప్పటి జీవితము సహాధీనకాక గొప్ప ఉదాహరణము కనుక తెలిపెదో, వినవచ్చును.”

“అంతకంటే భాగ్యమా?” అని నా ఆత్రత వెల్లడించితిని. ఆ మహనీయుడు తెలిపిన ఆత్మకథ సాకల్యముగా విని సంతసించితిని. సంగ్రహముగా అందలి ముఖ్యాంశము లివి.

అయోధ్యానగర ప్రాంతమందలి ఒక పేద కుటుంబమున జనించిన శ్రోత్రియబ్రాహ్మణు డితడు. చిన్ననాటనే తండ్రియొద్ద సంస్కృతకావ్యాగములను పఠించి, జ్యోతిశ్శాస్త్రములో ప్రవేశము గాంచెను. తరువాత ఆంగ్లభాష నభ్యసించి పట్టభద్రుడై, దొరతనమువారి కార్యస్థానములో చిన్న ఉద్యోగిగాచేరి, అతడు జీవితమును గడుపుచు వచ్చినాడు. అయిదు సంవత్సరముల క్రిందటి వంద రూప్యముల వేతనముతో ఒక కార్యాలయములో గణకోద్యోగుడుగా అతడు పనిచేయుచుండెను. అప్పటి కతని వయస్సు ఏబది. ప్రాతకాలపు తెల్లదొరలకు వంగి సలాములు కొట్టి పూలమాలలు వేయుటకు, వారి దొరసానుల దాసీ జనమునకు ఉపాయనము లర్పించి ఆశ్రయించుటకు, తగినంత స్వాతంత్ర్యము లేమిం జేసియు, కొంతమంది స్వతంత్రాభిప్రాయములు కల ఖండితవాది యగుటం జేసియు, సర్వసాధారణముగా రావలసినట్టి ఉద్యోగాభివృద్ధి అతనికి రాలేదు. ఉన్నంతలో తృప్తిపడు స్వభావముతో, ఆ విషయమున అతడు ప్రయత్నించినవాడు కాడు. చిన్న వయస్సులో అతనికి ఇద్దరు కుమారులు, ఒక కూతురును కలిగిరి. తరువాత అనుకూల సతియగు అతని పెండ్లాము కొంత అనారోగ్యముతో కొంత కాలము బాధపడినది. ఆమె జాతకమున సంతానభాగ్యమునకు ప్రబల కుజదోష సిద్ధించుచుండుట గమనించి, మరల గర్భధారణ సందర్భము వచ్చెనేని, ప్రమాదకారి కావచ్చునని నిర్ధరించి, బ్రహ్మచర్యమును సాధించుటకే కృతనిశ్చయుడై, ఇంద్రియనిగ్రహమునకు అనుకూలించు ఆహార విహార నియమములను అనుష్ఠించుచు, మంత్ర జపాదులను అతడు సాధించుచు రాసాగెను. తరుణవయస్క అతని భార్యకు ఈ దీక్ష ప్రారంభములో కొంత కష్టముగా చూపట్టినది కాని, తగిన ఉపదేశము వలన భర్తృదృష్టాంతమువలన ఆమె సహా క్రమముగా ఆ దీక్షను అలవరచుకొనగలిగినది. కనిపెంచు మార్గాంతరము లేమాపుటకే యీ యోగ్య భార్యకు ఆరోగ్యము చిక్కబడినది. ఆధ్యాత్మికజ్ఞానము విస్తరించినది. సకాలములో కూతురుకు, కుమారులకు వివాహములు జరిపినారా దంపతులు. తగినవిద్య గాంచి కుమారులు వృత్తిలో ప్రవేశించి తమ కుటుంబములతో హాయిగా నున్నారు. అల్లుడు యోగ్యతకల న్యాయవాది అగుటచే, కూతురు జీవితము రమ్యముగా సాగుచున్నది. పర్యంతావసానభాగ్యము వారందరకును కలదు. అగుటచే, యీ దంపతులకు సాంసారికముగా తొందరలు లేవు. ఉన్నంతలో తృప్తులై సుఖముగా కాలము గడుపుచుండిరి.

ఇట్లుండగా 61 వ సంవత్సరపు వయస్సునుండి మూడేండ్లు రవి శని దశ, తరువాత రెండుసంవత్సరములు రవి రాహుదశ, క్రమముగా తన జాతకమునకు రాగలదనియు, ఆ కాలమందే భార్య జాతకమున లగ్నమునకు వరుణ నవమ షష్ఠ దశ, రవికి అష్టమాధిపతియుండి కేంద్రదశ, సిద్ధముగనుననియు, ఆ శాస్త్రజ్ఞుడు ముందుముందే గమనించినాడు. అప్పటికే తన సంతానమునకు సహా ప్రారబ్ధకాల చూపెట్టినవి తన లగ్నమునకు మాత్రము ధర్మాని గురువృష్టి యుండుటచే, తన ఆయుర్దాయమునకు భంగము లేదనియు, కుటుంబవియోగము తప్పదనియు, అతడు నిర్ధరించుకొన్నాడు. ఆలోచించి, ఆలోచించి ఈ దుష్టదైవఫలమునకు స్వరూపాంతరము కల్పించ సంకల్పించినాడతడు. ఏబదియొకటవ యేట తటాలున ఉద్యోగమును చాలించుకొని, ఉపకారవేతనము సంపాదించుకొని, కూతుని ఇంట కొన్నాళ్లు, కుమారుల ఇండ్లలో వరుసగా కొన్నాళ్లు, విశ్రాంతిగా భార్యతో కాలము గడిపినాడు. ఎవరికి కాని, ఏమాత్రమైనా సందేహము కలుగకుండు

లేవు నాభర్త నాకు ప్రత్యక్షనరకము కాదుట ఎందుకు? నా భార్య గయ్యాళిగంప! ఆమె నోరు పడి లేక తీరితిను దుర్భరముంటున్నది. ఇదే నాగోడు" దీనముగా అతడు ప్రతి ఇచ్చెను

"శకళత్రస్థానములో రాహుకుజులున్నారు మీ భార్య అభిమానశాలిని, పరుషోక్తులు, కోపశీల, కానవచ్చును."

అని, కుణయూగి, మరల, "లగ్నాధిపతి సప్తమ భావములో నున్నాడు

'సప్తమే లగ్నపే భార్యా
దుశ్శీలా పతిర్భవేత్ '

అను న్యాయము ననుసరించి, ఆమె ఇష్టాను సారము మీరు నడిపింపవలసియుండును" నా రలికితిని

"ఆమె ఏమి కోరినా, ఎంత కష్టమైనా, చేయుటకు సర్వదా సిద్ధమేనండీ! కం కం అనక చేయగలను కాని, చేసినా తప్పు, చేయకపోయినా తప్పు, మాటలాడితే తప్పు, ఊరకుంటే తప్పు, ఇంటిలో ఉంటే తప్పు, బైటపోతే తప్పు! భరింప లేకున్నాను

"సంతానము?" అంటిని

"అరుగున్నారు పెద్దకూతురు పెండ్లికి సిద్ధముగ నున్నది కుమారులు చిన్నవారు వారినిచూచి ఇంత కాలమోర్చినాను కానిచో స్త్రీ హత్యాపరాధమునకై ఎప్పుడో ఉరికంబము నెక్కియుందును కదా!

ఆ పెద్దమనుష్యుని మాటలు చకితుడనైతిని. పరిస్థితి ఎంతో ఘోరముగా, ప్రమాదకరముగా, ఉన్నదని స్పష్టమైనది కాని, అతని దశలలో ప్రమాదమని ఏమీ చూపట్టవు భార్య జాతకములో ప్రబలమగు దుష్టదశలు ఏర్పడి, ఆమె గ్రహములలో ఇతని గ్రహములకు క్రూరవేధ ఇపుడు వచ్చి యుండినచో, ఇట్టి స్థితి వచ్చుటకు అవకాశము లేదు.

"మీ భార్యగారి జాతక మున్నదా?" అని అడిగితిని.

"ఉన్నది ఇరువదియొక్క గుణములున్నవని, దోషసామ్యమున్నదని, మహాయోగజాతకమని, ఏమేమో చెప్పి నా కొంప కూల్చినారు"

అని జాతక చక్రమొకటి ఇచ్చెను. జాతకి సాయన చక్రమిది :—

| | | | |
|---|---|---|---|
| 1 28-51<br>రా 25-24 | చ 19-44<br>వివాహ 29-42 | - | శు 15-7<br>కే 16-44 |
| వ 4-49(వ) | (సాయనము)<br>భాగ్య<br>జాతకము | | యు 0-47<br>శు 17-35<br>ఇ 26-56 |
| ఽ 8-19 (వ) | | | బు 9-46<br>ర 27-55 |
| X 29-8 | పుణ్య 20-40<br>భర్తృ 28-30 | | కే 25-24 |

లగ్నదశమాధిపతి గురువు దశమ కేంద్రములో, పుణ్యసహమము భర్తృసహమముతో చేరి భాగ్యభావములో, పంచమాధిపతి చంద్రుడు స్వస్థానములో, కల జాతకురాలు గొప్ప అదృష్టశాలిని అని చెప్పుటలో ఆశ్చర్యమేమి?

ఈమెను వివాహమైన అనంతరమే భర్తకు రోగము పట్టియుండవలెనే కాదా? అతని దశమకేంద్రములో ఈమె బృహస్పతి, అతని లగ్నగతకుజునకు ఈమె సింహ రవినుండి పూర్ణ త్రికోణ దృష్టి. అతని దశకు చంద్రునితో ఈమె భర్తృసహమమునకు నికరమగు అర్ధకోణ స్నేహదృష్టి! ఈ యోగములు గర్హితములు కానేరవు.

కాని, అతనికి క్లేశము కలిగించు కారణములను మన మిపుడు గమనింపవలసియున్నది ఈమె జాతకములోనున్న ప్రబల దోషములు రెండు వానింట కుజశనిసంయోగ మొక్కటి! చలచల క్రాగుచున్న నూనెలో దన్నీరు పోయుట వంటి యోగ మిది అందులో అది యుండుట చతుర్థ కేంద్రములో (గృహము, మనస్సు), కుజములో మంటలుమింటి కెగయగలవు. జాతకురాలి మనోధర్మమునకు ఈ స్వభావమున్నది కోపము చెలరేగినపుడు, తక్షణముగా ఏదైనా, ఇతరులకైనా, కాయకష్టమో ద్రవ్యనష్టమో, కలుగజేయునను నిర్ణయము ఆమె బుద్ధికి స్ఫురించును. ఇక, యుక్త తరుణుల సమసప్తక వేధ

వాడొకడు వచ్చెను. వంటవాండ్రులకు, సేవకులకు, పనివారికి జీర్వరచినా, క్లేశము తప్పలేదు. ఆ మొగోల భరింపలేక, వంటవాడు మూడుదినములకు, పనికి తె వారమునకు గొలుపు చాలించుకొని, కూలి పయితము తీసుకొనక పలాయనమైరి. క్రొత్తవారిని వెదకి తెచ్చినా, నా దుస్పయితమునకే తగినపనివారిని సంపాదించు యోగ్యత లేదని ఎత్తిపొడుపు. పనివారిని సంపాదించుట అసాధ్యముకాగా, హోటలునుండి భోజనము తెప్పించుకొను ఏర్పాటుచేసినాడు భర్త. కాని, తిండి బాగుగాలేదని మూడు మూడుదినముల కొక హోటలు మార్చవలసి వచ్చినది. కోపమూ, చెప్ప నలవి కాదు. ఆక్రోశము వర్ణనాతీతము. మంచి మాటలు చెప్పినచో, మంటలో నేయిపోసినచే! దండించినా వ్యవహారము బజారున కెక్కగలదు. కోపము వచ్చినపుడు, (అది రత్నక్కొచో రాగలదు) ఏందార్థము చేతికి దొరికినా, సర్వనాశనమే. సమీపమున పసిపిల్లలున్నచో నేలపైబడి విలవిల తన్నుకొనురీతిగా వాగ బాగుచుండగ చూచి సహింపుట అసాధ్యము. ఇరుగు పొరుగువారు సమాధానము చెప్పవచ్చినచో, వారికి ఆయుష్షు మూడినట్లే. బంధువులు విడిచి ఇంటికి రా స్నేహితులు దూరమైనారు. ఇరుగు పొరుగులవారితో రామరావణయుద్ధము. సంఘములో తలఎత్తి తిరుగుట అసమానమైనది. పుట్టినింటికి వెళ్ళుచుంటే వెళ్ళగు పిలుచుకొనిపోయి విడిచివచ్చినా మరునాడే తిరిగి వచ్చును. జీవితము దుర్భరమైనది. వారమునకు దినములు ఏడు! నాకవాడు అవసరముగా కుమారుని నాతిలో పసువబట్టు క్రతో బాదుచుండగా చూచి ఓర్వలేక తివాల్వరు తెచ్చి కాల్చుటకు సిద్ధమై, కారుణ్యేరు మనసుపనికిరందులము మాచి మానుకొన్నాడట! ముందేమో!

చలితదశలో భార్యకు రవి భర్త కజావిమాదికవచ్చి నాడు ఆమె బుధునికి భర్త చలితకని సమసప్తకము, చలిత చతుర్థము ఇంద్రుని సంయోగములో నున్నది. ఆమె చలితలగ్నము వరుణుని కేంద్రమునకు పోయినది. భార్య చలితకని భర్త చలిత శుక్రునితో సంయోగము. భర్త చలిత పుణ్యసహమును భార్య జన్మసమునికి కేంద్రము. భార్య చలిత వరుణునితో భర్త చలిత శుక్రుడు పార్శ్వకేంద్రము. భర్త చలితకుజుడు భార్య చలిత వరుణునితో పార్శ్వకేంద్రము!

ఏమి యోద్ధమిది? ఇంకను కొన్నికలవు. కాని, జరుగుచున్న కథకు ఈ దశలే చాలు. శాస్త్రీయముగా అతని అవస్థ దయనీయమైనది పాపము!

“ఇంకా అగ్నపక్షము తొమ్మిదియామముల దనదశ ఉండగలవు. ఈ కాలములో మీరు ఒకరికొకరు దూరముండుట మంచిది. లేనిచో, దశాంతపాపకాలము సన్నిహితమగుకొలది, ఎవరికైనా అత్యుగ్రహము కలుగవచ్చును. ఏదుష్పరిణామమయినా సాధ్యమే ”

“అది నా పరిస్థితులలో సాధ్యముకాలేదు కదండీ?”

“ఒక యుక్తిచేయండి. హిమాలయప్రాంతమునకు మీ ఉద్యోగమును మార్చి చేయించుకోండి. స్త్రీలు పిల్లలు నివసించుటకు వీలుకాదను నెపమున కుటుంబమును వదలి వెళ్ళవచ్చును. గుప్తకాలము తీరిన తరువాత మరలిరావచ్చును ” అంటిని.

“ఎత్! ప్రయత్నించవచ్చును. కాని నేను లేని కాలములో బిడ్డలగతి ఏమగునో అని భయము ”

“భయము అనవసరము లేదు. సంతానమునకు చెరుపు కలుగు సూచనలు లేవు. నిర్భయముగా వెళ్ళవచ్చును ”

“అప్పుడు ఈ దశల ఫలమేమగును?” అతని సంశయ మిది

“మీరు లేరు అని, ఆమె కష్టపడుచు, మీ మీద కోపముతో పండ్లు కొరకుట, చిరంజీవులను తలచుకొని మీరు ఖేదపడుట, ఇంతటితో ఫలము చెల్లిపోగలదు ”

అతనికి నచ్చచెప్పితిని. ఆ పెద్దమనుష్యుడు కొంత తృప్తిపడి స్వస్థానమునకు వెళ్ళినాడు. తరువాత రెండు నెలలలో ఏదో ప్రయాణపడి మార్పు సంపాదించుకొని వెళ్ళుచు మార్గమధ్యమున నా ఇంట ఒక పూట విడిసి పోయినట్టునని చెప్పి ప్రయాణము సాగించెను. ఆ రెండు మాసములు దాటినతరువాత మరల స్వస్థానమునకు ఉద్యోగమును మార్పించుకొనివచ్చి అతడు తన కుటుంబమును చేరుకొనగలిగెను. దుష్టదశలు గడచినవి. భార్యలో అప్పటి ఉద్రిక్తత తగ్గినది. స్వభావము మారలేదు కాని, సత్యముగా తరువాతి కథ నడచుచున్నది. అతడును తృప్తితో కాలమును వెళ్ళబుచ్చుచున్నాడు. అట్టి తొందర లేని దశలకే

# ఊహా కలాపం

శ్రీ యస్వీ జోగారావు

అదియొక సుఖస్వప్న సుముహూర్తము !
ముహుర్ముహు రీహోదోహాల
మధురోహా మహావర్తము !
అదివివిక్త మహోరాత్ర మిహాజీవిత
మహా యాత్ర కవిముక్తము !

* * *

అదిఅపూర్వశరత్పూర్ణిమా శర్వరీ సర్వ
సౌందర్య సర్వస్వధూర్వహాసర్వంసహా!
అదివిశ్రాంత తమిస్ర విధూదయ మృదూస్ర
విశద్వరవలాహకశకలైక ప్రకాశమాకాశము!
అదిఆకాశ విపులా తలాంచల విశాల
వివిధాశావకాశ పేశల
రాకాసుధాకరాలోకవ్యాకుల
సలిలాఘు దీర్ఘ సమానము సముద్రము !
ఆ సముద్ర తీరమ్మున
అదిగో యొక శివాలయము
అతి శిథిలము ! శివాలయము !
శిథిలాలయ సవిధమ్మున
చిత్తభవుని చితి రగిలిన
స్థాణ్వాశ్రమ స్మశానమ్ము
నా నదిగో యొక సమాధి !

* * *

ఆ చోట నావేళ అంభోధి అలలపై
గయ్యాళిగాలి వాహ్యాళికేళి-
ఆచోట నావేళ ఆకాశ వీధిలో
జాబిల్లి మొగిలు దోబూచులాట

* * *

ఆ సమాధి వేదికపై
ఆసీనుండై కవి యొక
డున్నా డున్మత్తుని వలె
మిన్నువంక కన్నిగిడ్చి-
కలనైనా కనిపించని
తన ప్రేయసి సాకీ ఆ
కాశం బన్నట్లు కటా
ఉన్నా డున్మత్తుని వలె
మిన్నువంక కన్నిగిడ్చి-
వెన్నెల కను సన్నలలో
వెలిమబ్బుల వెనుక నొదిగి
ఊహాల కందీ యందని
మోహనాంగి హొయలు దలచి
కావ్యాలాప కలాపము
కడుకొని చేయుచు పాపము
ఉన్నా డున్మత్తుని వలె
మిన్నువంక కన్నిగిడ్చి!
అపు డకస్మికముగ నల
చంద్రకిరణ మొకటి జారి
సంద్రములో పడి యక్కడ
నొక యల చెలరేగి విగు
ర్వించి విసర నొక గాడుపు !

ఐశ్వర్యము!
కదలి బయల్వెడలినదో
చదలనుండి జారినదో
కాని యొకానొక లతాంగి
మేనంతా మేలిముసుగు
మేఘములో చంద్రరేఖ!
అదిగో తన కభిముఖముగ-
అడుగులు తడబడ
వడివడిగావవ్వడి లేకుండగ
నడచుచున్న దొంటరిగా!
అలో నొక అభీలాకారు
డతి క్రూరుడు
ముష్కర తస్కరు డతిదుష్కర
కార్యదీక్షా ధుర్యుడు
కాంతడాసి కత్తిదూసి
నగలక్కడ పెట్టి మరి
కదలు మనుచు బెదరించెను
ఆ ధృష్టా ధరోష్ఠ
చటుల స్ఫోట నోద్భూతోద్ధుర
వాతవిధూతమై
మే బాసెను మేలిముసుగు!
అహో సహజ మహోరాశి!
లోకోత్తర రూపోజ్జ్వల'
తన ఊహా దాత్యూహా
వ్యూహాములో
విరిసిన విద్యుల్లత!
తన ఆశాకాశములో
వికసించిన రాకాశశి!
అచ్ఛముగా తన ప్రేయసి!
గతచంద్రగ్రహణవేళ-

అతికామార్థాతురులై
అభిసారము, కాదుకాదు
వ్యభిచారము లాభ మనెడు
బంధుజనుల బాధకోసి
సంద్రములో సాగొరిన
చంద్రవదన! జలదవేణి!

* * *

ఆ క్షణమ్మున అంగ మెల్లను
అక్షులుగ వీక్షించి యామెను
సొమ్ములుంచిన చొప్పు లేదని
కట్టలేదో తట్టినా యొక
ఆశ యెట్లను నాశమైనది
పొరుగు నేలను పొందరా దని
అనవడుచున్నాడు చోరుడు.
'అన్న కన్నగ! ఆభరణములు
సున్న నీవిక తప్పకొ'మ్మని
ఆమె యన్నది.
'ఏమి వగుసిది! యేమి మన్నన!
ఏకతమ ఎలనాగ లెవ్వరు
నడికిరేయి పరాయి పురుషుని
పలుకరించెడి పాడిగా' దని
వాడు గండర గండడుండడు!
'బావ పోసి బాకుగా కీ
రొండిలోపల రొక్కమున్నద?'
అన్నదామె మహాద్భుతమ్ముగ
అపు డకస్మికముగ నల
చంద్రకిరణ మొకటి జారి
సంద్రములో పడి యక్కడ
నొక యల చెలరేగి విగు
ర్వించి విసరె నొక గాడుపు!

శిథిలాలయ గర్భములో
శివు డొనర్చె సత్కారము!
సమాధిచాటున కేళికల
సల్పిన దొక నృకపాలము!
కలవరపడి కల మేలుకొన
సవధరించె కవీశ్వరుడు.
ఏరీ యా నిశాచరులు
వామకర్మ వశంవదులు?
అదుగో ఘోర విషాణము,
సమాధి స విధమ్మున నొక
పటుకర్కశ పాషాణము!

అదిగో మరి అభిసారిక,
శిథిలాలయ శిల్పములో
శివుని వెనుక చిత్ర మనెడు
చిత్రభవుని పరిచారిక!
అవేమిటా ఊళలు?
కడతేరిన కవిస్వామి
కడతేరని ముడి యూహాలు.
అదేమిటా సమాధిపై
చిత్రముగ శిలాక్షరములు?
"భావకవి కట్టిన ఊహాకలాపములో
భామ వేష మెప్పటికీ తెర వెళ్లదు"

తెలిసిన మావుకొంతో చెప్పి ఈ పని యిప్పించాను అయినా వాడిస్థితి అలాగే వుంది. ఊళ్ళో మాత్రం దినదినంగా అప్పులు పెరిగిపోయి వున్నాయి. ఇంట్లో మొత్తం చూస్తే అన్నిటికీ ఇబ్బందిపడుతున్నారు. సరిగా తినడానికి తిండీ, కట్టుకోడానికి బట్టా కూడా లేక వాడూ ఆ పిల్లా పడరాని అవస్థలన్నీ పడుతున్నారు. ఇంత చిన్న వయస్సులోనే వాళ్ళిద్దరి జీవితాలకి సుఖం లేకుండా పోతోంది."

సత్యనారాయణ తను చెప్పేదంతా అయిపోయినట్టుగా భారంగా ఊపిరి వదిలి కుర్చీలో చేరబడ్డాడు. రాజ్యం ఒక అయిదు నిముషాలు ఏదో ఆలోచిస్తూ అలాగే కదలకుండా కూర్చుంది. ఆ తర్వాత ఇలాగ అంది:

"అయితే ఇంతకీ మీరు అనేదేమిటీ అంటే మీ తమ్ముడికి చిన్నతనంలో ఎవ్వరూ చెప్పకుండా వదిలేయడం చేతనే అతని యిప్పటి స్థితికి వచ్చాడంటారు. అయినా అతనికా వివేకం వుండాలి కాని ఒకరు చెబితే తెలుస్తుందిటండీ!—చెప్పినా వింటాడా?"

సత్యనారాయణ అన్నాడు

"రాజ్యం, నువ్విలా అంటావని నాకు తెలుసు. అయితే నేను చెప్పవలసినది ఇంకా పూర్తి కాలేదు. చెప్పేదంతా పూర్తిగా విని తర్వాత సందేహాలు తీర్చుకో!—ఎవరి వివేకం వారికుండాలి కాని ఒకరు చెప్పినంతమాత్రాన తెలుస్తుందా? వింటారా? అన్నావు. చిన్నతనంలో ఎవ్వరూ ఏదీ చెప్పకపోతే వాడికి, మంచి చెడ్డలెంచి ఏ కష్టాలూ ఎరగకుండా తల్లిదండ్రుల చాటున గారంగా పెరిగినవాడికి తను చదువుకోవాలనీ, చదువుకోకపోతే తను పెద్దవాడయ్యాక ఉద్యోగం దొరకదనీ, ఉద్యోగం లేకపోతే పెళ్ళాన్నీ పిల్లల్నీ పోషించడం కష్టమని ఇవన్నీ ఏం తెలుస్తాయి?—ఇంక వినడం మాటా?—మొదట్లో ఏ పిల్లవాడికైనా చదువు, పని అంటే భయంగానే వుంటుంది. అయిష్టంగానే వుంటుంది. అలాగని చెప్పి ఊరుకుంటే వాళ్ళెలాగు పనికొస్తారు?—చిన్నతనం చేత వాళ్ళకి తెలియకపోతే వాళ్ళను చదువుకోమని అన్నప్పటికీ పెద్దవాళ్ళు వాళ్ళకి బోధపరచాలి. వాళ్ళు వినకపోతే కాస్త తీవ్రంగా నైనా ప్రవర్తించాలి. మొదట్లో కొద్దికాలం అది వాళ్ళకి బాధగా అనిపించినా తర్వాత తర్వాత వాళ్ళంతట వాళ్ళే తెలుసుకొని దారిలో పడతారు. చెప్పకపోతే అనుభవించే దాకా ఇటువంటి విషయాలు తెలియవు. ఇంతెందుకు తలిదండ్రుల కనుసన్నల్లో తప్పిపోయింది కాని లేకపోతే నీ వాడు ఈమాత్రం ఉద్యోగం అయినా ఈ మాత్రంగానైనా సంపాదించగలిగేవాడా?—నువ్వు ఈ పాటి మంచిబట్టలు కట్టుకొని ఇంత నీటుగా ముస్తాబై ఇంత సర్వాధికారంగా వుండగలిగేదానివా?—మన సంసారం కూడా మా తమ్ముడి సంసారంలాగే వుండును!"

రాజ్యం ఊపిరి బిగపట్టుకొని వినసాగింది. సత్యనారాయణ చెప్పాడు.

"పన్నెండేళ్ళ వరకూ నేను కూడా వాడిలాగే చదువూ సంధ్యా లేకుండా తోటలమ్మట, దొడ్లమ్మట తిరిగినవాడినే!—అప్పుడు చిన్నతనం!—వివేకమున్నంత జ్ఞానం అప్పుడెక్కడిది?—ఎంతసేపూ ఏ తోటలో కొబ్బరికాయలు పడుతున్నాయి, ఏ చెరువులో దిగి యీదుదామా అని కాని చదువుకుందాం బడికి వెళదాం అన్న ఆలోచన ఉండేది కాదు. దినానికి ఎన్ని తడవలు బడికి వెళ్ళిపోయినా మా అమ్మ ముద్దుచేసి, మా నాన్నగారు స్వంతపనుల్లో ఆయన తీరిక లేక చేత పట్టుకు వెళ్ళమని చెప్పేవారు కాదు. నేను మొదటి నుంచీ కాలం బడికి వెళ్ళేవాడిని కాదు. ఇంటి దగ్గరైనా చదువుకునేవాడిని కాను. ఎప్పుడూ ఇంటి దగ్గర మాత్రం ఉండకుండా తిరుగుతూ వుండేవాడిని తోటలంటా, చెరువులంటా."

"ఇలాగ వుండగా మా అమ్మ అన్నగారు ఒకసారి మా యింటికి వచ్చాడు. ఆయన కలెక్టరు కోర్టులో హెడ్ గుమాస్తాగా పనిచేస్తూ వుండేవాడు. ఆయనకు సంతానం అయిదుగురు కొడుకులు ముగ్గురు కూతుళ్ళు. వారంతా ఇప్పుడూ ఉన్నారు. పెద్ద కొడుకు డాక్టరు, రెండవ కొడుకు వకీలు, అప్పటికి మూడోవాడు ఇంజనీరింగు, నాలుగవవాడు ఎం. ఎస్‌సి., అయిదవ కొడుకు బి. కాం. చదువుతూ వుండేవాడు. కూతుళ్ళలో ఇద్దరు కొడుకుల తర్వాత పుట్టిన పెద్ద కూతురు అయిదో ఫారంలోను చదివి మా మేనత్త పెళ్ళయి కాపురం చేస్తూ వుండేది. ఆమె భర్త ఆ వూరిలో ప్లీడరుగా వుండేవాడు. తర్వాత ఇద్దరు కూతుళ్ళూ మగపిల్లలందరి తర్వాత పుట్టినవాళ్ళు. రెండవ కూతురు అయిదవ ఫారం, మూడవ కూతురు మూడవ ఫారం చదువుతూ వుండేవారు.—ఆయన మా యింటికి వచ్చాడు. పరిస్థి

కుంటున్నీ చూశాడు. ఇంటిమీదపడి అప్పులవాళ్ళు అనరాని మాట లంటున్నా, ఇంట్లో వస్తువులు లేవని మా అమ్మ ఏడుస్తున్నా, నేను చదువు సంధ్యలు లేక పాడైపోయి తిరుగుతున్నా, తన కేమీ సంబంధం లేదన్నట్టుగా వున్న మా నాన్నగారి ధోరణిని చూసి చాలా ఆశ్చర్యపడ్డాడు కోపంకూడా వచ్చింది మా నాన్నకి శ్రద్ధ లేకపోయినా తనేనా అతనికి గట్టిగా చెప్పకందుకు మా అమ్మని మందలించాడు నేనింక మరి అక్కడుంటే దమ్మిడీకికూడా ఎవరికీ రాకుండా పాడవుతానని, తన వద్దకు పంపించేస్తే మంచి క్రమశిక్షణలో వుంచి రస్తాలోకి తీసుకొస్తానని చెప్పి నన్ను వాళ్ళ యింటికి తీసుకొనిపోయాడు."

"మా మామయ్య చాలా ఖచ్చితమైన మనిషి పద్ధతైనవాడు అతను ఏర్పరచిన పద్ధతుల ప్రకారం అందరూ నడుచుకుంటూ వుండాలి!—పిల్లలందరికీ ఆయనంటే హడల్! అంత పెద్ద డాక్టరు ఉద్యోగం చేస్తూంటే పెద్దవాడికి, వకీలుగా ప్రాక్టీసు పెట్టుకొని అంతపేరూ, రాబడీ వున్న రెండవవాడికికూడా పెళ్ళిళ్ళయి పిల్ల తండ్రులైనప్పటికీ తండ్రి అంటే గౌరవం, భయం రెండూ వుండేవి ఆయన అన్న మాటకు వాళ్ళుకూడా ఎదురుచెప్పేవాళ్ళుకారు ఆయన పిల్లలకి కొన్ని పద్ధతులేర్పరిచాడు అనుగుణంగా ఒరుసగా విడదలేవారు! ఇలాటివాటిలో మామూలుగానే వుండే వాడు కొంతమంది పెద్దలు కాఫీ పిల్లలకి అలవాటు చేస్తే పాడైపోతారని దగ్గర పిల్లలున్నా వారికివ్వకుండా తాము మాత్రం తాగేస్తారు కాని మా మామయ్య యీలోపలో కాఫీ నిషేధంకాదు. ఉదయం ఏడు గంటలకి కాఫీ, సాయంకాలం నాలుగు గంటలకి కాఫీ, ఏదో ఫలహారం రోజూ వుండేవి ఉదయం కాఫీ అయాక పదిగంటలవరకు ఎవరి పనులలో వారుండేవారు పది గంటలకి భోజనం చేసి, కాలేజీలకి కొందరు, హైస్కూల్కి కొందరు వెళ్లిపోయేవారు. మామయ్య రెండో కొడుకు కోర్టుకు వెళ్లిపోయేవాడు. పెద్దవాడికి అప్పటి ఉదయం ఏడున్నరనుంచి పదిగంటలవరకు, మధ్యాహ్నం మూడున్నరనుంచి అయిదున్నరవరకు ఉండేది మిగతా వేళల్లో ఆయన ఇంటిదగ్గరే వుండేవాడు నేను అక్కడ అప్పటికింకా ఏ స్కూల్లోను చేరలేదు. ఇంటిదగ్గర నాకు బాగా ట్యూషన్ చెప్పి ఆ మీదటికి హైస్కూల్లో మొదటి ఫారంలో చేర్పించాలని మామయ్య ఉద్దేశం. నా కప్పటికి ఇంగ్లీషు అక్షరాలు మాత్రం వచ్చాయి మాటలు, ఎక్కాలుకూడా బాగా వచ్చేవికావు

"సాయంకాలం కాలేజీలనుంచీ, హైస్కూళ్ళ నుంచీ వచ్చాక కాఫీ టిఫిను అయాక మగపిల్లలంతా అలాగే షికార్లకని వీథిలోకి వెళ్ళేవారు ఏడున్నర వరకు తిరిగి ఏడున్నరకి అయేసరికి భోజనాలకి వచ్చేవారు. భోజనాలయాక ఎవరి గదుల్లో వారు కూర్చొని పదిగంటలవరకు చదువుకొనేవారు పది గంటలకి అంతా నుండి నిద్రపోయేవారు ఇవి వాళ్ళింట్లో పిల్లల కేర్పరచిన పద్ధతి అంతమంది ఈ పద్ధతి ప్రకారమే నడిచేవారు అయితే ఇంత పద్ధతిగావున్నా ఆయన పిల్లల కెంతవరకు స్వేచ్ఛ అవసరమో అంతవరకు ఇచ్చేవాడు వాళ్ళ సరదాలన్నీ తీర్చేవాడు చూడదలచిన సినిమాకాని, నాటకంకాని, సర్కసుకాని వచ్చిందంటే ఆ కార్యక్రమాలన్నీ తోడుకొని వెళ్ళేవాడు ఇంట్లో ఎవ్వరికీ రవ్వంతలోటు రానిచ్చేవాడుకాదు కాని ఎవ్వరికి మంచి మార్కులు రాకపోయినా, చదువులో అశ్రద్ధ వహించినా అగ్గిరాముడైపోయేవాడు "ఏమిరా! ఇప్పుడు చదువుకోకపోతే తర్వాత ముసలితనంలో దానికి కాని మనసంగుపుకూ పనికి రావురా!" అంటూ తిట్టేవాడు. నాకు మొదట్లో ఆ పద్ధతులన్నీ చాలా బాధగా వుండేవి వెళ్ళిన మర్నాటి నుంచీ ఆయన నన్ను చాలా కట్టుదిట్టంలో వుంచాడు. నన్నెక్కడికీ కదలనిచ్చేవాడుకాదు చదువుతేకాని ఒప్పేవాడుకాదు మా ఊళ్ళో వున్నప్పుడు చెరువులంట, తోటలంట, ఇష్టం వచ్చినట్టు తిరిగే నాకు మా మామయ్య చేసిన కట్టుబాట్లు చాలా కష్టంగా వుండేవి నాకా యిల్లు అప్పట్లో జైలులాగే అనుపించేది ఆయన ఒక్కొక్క రోజున చదువుకోకపోతే గట్టిగా కసిరేవాడు నా కప్పుడు లోలోపల ఎంతో దుఃఖం వచ్చేది కాని ఇప్పుడు అలోచిస్తుంటే ఆ పద్ధతులెంత మంచివో తెలుస్తోంది నాకు ఆ యేడాదంతా బాగా ట్యూషన్ చెప్పి హైస్కూల్లో మొదటి ఫారంలో చేరేలాగ చేసే బాధ్యత తన పిల్లలందరిమీద వేశాడు మా మామయ్య నాకు కొద్దిరోజుల్లోనే మాటలు, ఎక్కాలు పూర్తిగా వచ్చేశాయి. అప్పటినుంచి నాకు ఆ ఇంటందరూ ట్యూషను చెప్పడం అరంభించారు ఎవరికి తీరిక వున్నప్పుడు వారు నాకు లెక్కల్లోను, తెలుగు, ఇంగ్లీషు, హిస్టరీ, జాగ్రఫీ, సైన్సు మొదలగు

డబ్బును చీర కొనుక్కోమని ఇస్తున్నాను. ఇంతకంటే సాయపడటానికి మన ఆదాయం మాత్రం ఏమంత చెప్పండి!" అంది రాజ్యం భర్త ముఖంలోకి చూస్తూ

"నిజమే రాజ్యం!" అన్నాడు సత్యనారాయణ ఏదో ఆలోచిస్తూ కొంతసేపు ఊరుకొని మళ్లీ అన్నాడు

"అప్పట్లో ఇక్కడుండలేకంటే వాళ్లిద్దరూ గారింటికి వెళ్లిపోయి కొంతకాలం అక్కడుంటే మంచిదని పిస్తున్నది!

అక్కడికి వెళితే మాత్రం ఏం సుఖపడిపోవాలి ఆ వదినగారు నానా కాల్పులు కాల్చి వేధిస్తుంది!"

"అప్పులవాళ్లు ఇంటి వదలకుండా తిరుగుతున్నారట వాళ్ళందరినీ తప్పించుకుంటూ నీవు కనబడకుండా తిరుగుతున్నావట వాళ్లంతా ఏదొక్కడైనా కనబడితే తంతాం అంటున్నారట"

"అయ్యబాబో! వాళ్లతో మీకేనా చెప్పారు కారండీ!" అని అడిగింది రాజ్యం

"చెబితే మాత్రం ఎంతకాలం ఊరుకుంటారు రాజ్యం చూడాలు, సంవత్సరం అయినా దమ్మిడీ కూడా తీర్చకుండా వుంటే!" అన్నాడు సత్యనారాయణ.

"పెనవలు అన్నంత పని చేస్తారేమిటో!" అంది రాజ్యం భయంగా

"అయినా మనం ఏం చేయగలం రాజ్యం?— అప్పటికీ నేను చెబుతూనే వున్నాను వాళ్లతో!" అన్నాడు సత్యనారాయణ విచారంగా

"ప్చ్" అంది రాజ్యం భారంగా.

వారం రోజులు గడిచాయి. కుంతల ఈ వారం రోజులనుంచీ రాలేదు

ఆ వేళ సాయంత్రం ఆఫీసునుంచి ఇంటికొస్తూనే, "కుంతలొచ్చిందా?" అని అడిగాడు సత్యనారాయణ భార్యని.

"ఆ వేళనుంచి మరి రాలేదండీ!" అన్నది రాజ్యం.

"రాకపోతే నువ్వైనా వెళ్లి కనుక్కోవదూ ఏమిబ్బందులు పడుతున్నారో ఏమిటోను!" అన్నాడు సత్యనారాయణ.

"నాలుగురోజుల క్రిందట వెళ్లాను కదుటండీ!" అంది రాజ్యం

"అప్పుడు వెళితే సరా!— వాళ్ల పరిస్థితులు బాగులేనప్పుడు ఎలా వుంటున్నారో కనుక్కుంటూ వుండొద్దూ మనంవుండి!" అన్నాడు సత్యనారాయణ.

"ఇంకా మరెలాగ కనుక్కోమంటారండీ!" అన్నది రాజ్యం

"అదికాదు రాజ్యం, వాళ్ల పరిస్థితి మరీ ప్రమాదకరంగా వుంది ఇవాళ పొద్దున్న ఎవడో అప్పులవాడు ఇంటో కూడా చొరబడి మాటిమ్ముడిని తిన్నపోతే కుంతల గోలపెట్టగా ఇరుగుపొరుగులవాళ్లొచ్చి దెబ్బలాడి బయటికి పంపించేశారట వాడిని"

"ఇది మీకెవరు చెప్పారు?"

"మా ఆఫీసులో పనిచేస్తున్న గుమాస్తా ఒకడు ఆవీధిలోనే వుంటున్నాడు వాడు చెప్పాడు నేను వెళ్లి కనుక్కుందామంటే ఈ ఆఫీసుపనివల్ల అవకాశం లేకుండా వుంది అదీ కాకుండా అవిల్లకి నా దగ్గర ఊరంత మొహమాటం!"

"బాగుంది!" అన్నది రాజ్యం

"ఒకసారివెళ్ళి కనుక్కొని వచ్చేదాం రాకూడదూ?" అని అడిగాడు సత్యనారాయణ

"ఇప్పుడా?" అంది రాజ్యం బద్ధకంగా

ఏం?—రిక్షాలోవెళ్ళి మళ్ళీ అరగంటలో వచ్చేద్దాం!" అన్నాడు సత్యనారాయణ రాజ్యం నిముషం ఆలోచించి, "అయితే అలాగే!" అంది

"ఉండు నేను రెండు నిముషాల్లో మొహం కడుక్కొనొచ్చేస్తాను!" అంటూ సత్యనారాయణ ప్యాంటు విప్పి లుంగీకట్టుకొని తువ్వాలు, సబ్బుపెట్టె పట్టుకొని బాత్ రూంలోకి వెళ్లాడు

ఇంతలో వీధి తలుపు దఢీమని తోసుకొని ఒక పదిహేనేళ్ళ కుర్రవాడు గాభరాపడుతూ లోపలికొచ్చి, "ఏమండీ, కుంతల ఒంటిమీద కిరసనాయిల్ పోసుకొని నిప్పంటించుకుంది చాలా ప్రమాదంగా వుంది. మిమ్మల్ని వేగంగా రమ్మంటున్నారండీ!" అని చెప్పాడు. ఈ మాట వినగానే రాజ్యం "ఆఁ!" అంటూ అలాగే ప్రాణపడి నిల్చుండిపోయింది ప్రక్కనున్న బాత్ రూంలోవున్న సత్యనారాయణ ఈ మాట వినగానే సగం సగం మొహం కడుక్కుంటూన్న

# చిన్న సంసారం

నాన్నా గభీమని బయటకు వచ్చి "ఏమిటే!" అని అడిగాడు

"శకుంతల ఒంటికి నిప్పంటించుకుందటండీ!" అంది రాజ్యం.

"అవునండీ, ఇప్పుడే అరగంట క్రిందట, మంట లార్పి పక్కింట్లో పెట్టారు. చాల ప్రమాదంగా వుంది. మా నాన్నగారు ఇంజక్షను లిస్తున్నారు." అన్నాడు వచ్చిన కుర్రాడు.

"మీ నాన్నగారెవరు"?

"డాక్టరు కామేశ్వరరావుగారండీ!"

వెంటనే సత్యనారాయణ లాల్చీ వేసుకొని వీధిలో పోతున్న రిక్షాని పిలిచాడు. అతను, భార్య వెంటనే రిక్షాలో బయల్దేరారు.

అయిదు నిముషాలలో రిక్షావల్లె ఆ యింటి ముందు ఆగింది. సత్యనారాయణ, రాజ్యం రిక్షా దిగి లోనికి వెళ్లారు. కాని అప్పటికే శకుంతల చనిపోయింది. ఆమె మృతదేహం మంచంమీద పడివుంది. వారిద్దరు వెళ్ళేసరికి ఇంట్లో ఇసక వేస్తే రాలనంతమంది జనం చుట్టి వేసివున్నారు. శకుంతల దేహాన్ని చూసి సత్యనారాయణ దుఃఖంతో అలాగే [illegible] ఆమె దేహం చాలాచోట్ల కాలిపోయి ఎర్రగా కనిపిస్తున్న మాంసంతో భయంకరంగా వుంది ముఖం పూర్తిగా కాలిపోయి వికృతంగా వుంది. రాజ్యం చూడగానే కెవ్వుమని అరచి భయంతో కళ్ళుమూసుకుంది

శకుంతల మృతదేహంవున్న మంచం ప్రక్కనే చిన్న అల్మైరా వుంది ఆ అల్మైరాలో చిన్న హరికేన్ లాంతరు వుంది. ఆ లాంతరులోని కిరసనాయిలే ఒంటిమీద పోసుకుంది శకుంతల. ఆ లాంతరు క్రింద ఒక ఉత్తరం కనిపించింది సత్యనారాయణకి. అతను ఆ ఉత్తరం తీసి చూశాడు. అది తన తమ్ముడు భార్యకి వ్రాసిన ఉత్తరం అందులో ఇలాగ వ్రాసి వుంది

శకుంతలా!

నువ్వు ఈ ఉత్తరం చూసేసరికి నేనిల్లు వదలి చాలా దూరం పోయివుంటాను. నేనిలాగ నిన్ను విడిచిపెట్టి వెళ్ళిపోతున్నందుకు నామీద నీకు చాలా కోపం రావచ్చు. అసలు నాకుకూడా నిన్నొదిలి వెళ్లడం ఇష్టంలేదు. కాని ఏంచేసేది! పరిస్థితులిలాగ వచ్చాయి. నాకొచ్చిన జీతం మనిద్దరికీ పదిహేను రోజులకి మాత్రమే సరిపోతోంది. తక్కిన పదిహేనురోజులూ నువ్వు ఎవ్వరింటికా అడిగితెచ్చిన నాడు తినడం లేని నాడు ఉపవాసాలుండటం జరుగుతోంది. ఊళ్లో ఎవ్వరూ అప్పుకాని, అరువుకాని ఇవ్వకుండా వున్నారు. నాకు ఈ పరిస్థితులలో మనం ఎంతకాలం సంసారం సాగించగలం!—ఏమిటో శకుంతలా!— రానురాను బ్రతుకంటేనే రోత పుడుతోంది. మా అన్నయ్యలాగ చిన్నప్పుడు చదువుకొనివుంటే ఇప్పుడిన్ని బాధలు లేకపోయేవి కదా!—కాని అప్పుడేమిటో చిన్నతనంవల్ల ఇవన్నీ తెలియక చదువుకోకుండా తిరిగాను. మా అన్నయ్య నాన్నా అయినా అప్పుడు శ్రద్ధ వహించి గట్టిగా చెప్పారు కారు. కాని ఇప్పుడవన్నీ తల్చుకొని విచారిస్తే ఏం లాభం! అయితే ఇప్పుడు రెండు సమస్యలు నన్ను బాధిస్తున్నాయ్. మొదటిది సంసారం ఇంక ఎలాగ నడుస్తుందా అన్నది, రెండవది అప్పులవాళ్లబాధ. ఇప్పుడు మొదటిదానికంటే రెండవ బాధే అధికంగావుంది. ఎక్కడికి వెళ్ళినా ఈ అప్పుల వాళ్లు ప్రాణాలు తీస్తున్నారు. చివరికి ఇంట్లో కూడా చొరబడి చేయిచేసుకోడానికి తయారవుతున్నారు. ఇంకిక్కడ కొంతకాలం ఎటైనా తిరిగి ఈ బాధలు తప్పుకోవాలన్న ఉద్దేశంతోను, ఇంతకంటే మంచి ఉద్యోగం దొరుకుతుందేమో అన్న ఆశతోను ఇల్లువిడిచి పోతున్నాను. ఎటు పోతున్నానో మాత్రం ఇప్పుడు చెప్పలేను. అసలు ఎటుపోవాలనో నాకే తెలియటంలేదు. నాగురించి నువ్వు మరేమీ విచారించకు. నేనుండిమాత్రం నిన్నేం సుఖపెట్టేను!— ఇలాగ నలభై రూపాయల జీతం తెచ్చుకుంటూ ఇక మీదట మాత్రం ఏం సుఖపెట్టగలను?—అందుకే నువ్వు మరి విచారించకుండా మా అన్నయ్య దగ్గరకు వెళ్ళిపో!—మనరోజులు బాగుండి ఏనాటికైనా ఈ దారిద్ర్యం వదిలితే తిరిగి కలుసుకుందాం!—

శేఖరు.

# నక్షత్రాలు: గ్రహాలు

శ్రీ కాళ్ల మణిభూషణరావు

అనాది యుగములనుండి అనంతమైన నీలాకాశమున అసంఖ్యాకమై మినుకు మినుకు మెరయు నక్షత్రమండలములను చూచుటవలన వీటియందు ప్రాణి జీవించుటకు ఎట్టివైనను ఆధారములు గలవా? లేవా? యను సమస్య వచ్చి అపరిష్కృతమైయుండెను. ఈ విశాలవ్యవస్థలో ఇట్టి అసంఖ్యాకమైన నక్షత్రములు దేనినుండి ఉద్భవించినవో యను తలంపు రాక మానదు.

యుగయుగములనుండి ఈ సమస్య అపరిష్కృతమైయుండెను. నేటి ఖగోళశాస్త్రము అత్యున్నత స్థితికి వచ్చిన తరువాత అనేక శాస్త్రజ్ఞులు ఈ విషయమై పలువిధముల దర్యాప్తు జరిపిరి. మహాశాస్త్రవేత్త, మేధావి, యగు సర్ హెరాల్డ్ స్పెన్సర్ జోన్సు తన అనుభవశాలియగుటచే ఈ విషయమునుగూర్చి కొన్ని ముఖ్యోద్దేశములను తెల్పుచు అనేక గ్రంథములను రచించెను. తన ముఖ్య పరిశీలనబట్టి ఎల్లప్పుడు ఒకే పరిమాణము గొప్పతేజస్సు, భయంకరమైన అగ్ని, వాయువులు మొదలగు వానితో నిండిన ఈ సూర్యమండలము చుట్టూ పడి దిక్కుగా తిరుగుచున్న నవగ్రహములలో భూమియను నొక గ్రహమై యున్నదని తెలిపెను.

భూమిపై నివసించెడి ప్రాణికోటివలె ఇతర గ్రహములందుకూడ ప్రాణులుండుటకు కొన్ని అవకాశములు గలవని చెప్పుచున్నారు. సూర్యునకు మిక్కిలి దగ్గరగను దూరముగను సంచారము చేయు గ్రహములందు ప్రాణులు జీవించుటకు ఆధారములు లేవు. కొన్ని జీవులు మాత్రము హెచ్చు ఉష్ణమునందు అనగా మరుగుచున్న నీటియావిరియందును, మంచు కన్న -10°C ఉష్ణము వద్దను జీవింపగలవు. ఆయా ప్రదేశములందుండెడి వాతావరణమునందు ప్రాణి జీవించుటకు అనుకూలముగ వాయువులు అనగా ప్రాణవాయువు నత్రజని నీటియావిరి మున్నగునవి ఉండిన అప్పటికూడా ప్రాణులు జీవింపగలవు

సూర్యుని చుట్టూ తిరుగుచున్న నవగ్రహములలో బుధుడు మిగిలిన గ్రహములకన్న దగ్గరగా నున్నాడు. బుధుని ననుసరించియే శుక్రుడు అను గ్రహము తిరుగుచున్నది. భూమి తరువాత పైగ్రహములవలె ప్రత్యేక వృత్తములలో అంగారకుడు బృహస్పతి, శని వరుణుడు, ఇంద్రుడు, యముడు అను గ్రహములు వరుసగా సూర్యుని చుట్టూ తిరుగుచున్నవి

గ్రహములు నక్షత్రములు గావు. వీటికి నక్షత్రములవలె ప్రత్యేకముగ తేజస్సుగాని లేదు గాని సూర్యుని కిరణములచే తేజోవంతముగా మన దృష్టికి గోచరించును. నక్షత్రములకు, సూర్యునకు మధ్యనుండెడి దూరముతో ఈ నవగ్రహముల దూరము పరిపోల్చిన ఈ గ్రహములు సూర్యునకు చాలా సమీపమునందున్నవని చెప్పుటలో సందేహము లేదు. ఈ గ్రహములలో మిక్కిలి దగ్గరగానున్న బుధుడు సూర్యునకు మూడు కోట్ల అరవది లక్షల మైళ్ళ దూరములో గలడు. నవగ్రహములలో చివరనుండెడి గ్రహములు ఇంద్రుడు, యముడు సూర్యునకు సుమారు 400 కోట్ల మైళ్ళ దూరములో గలవని చెప్పగలము. నవగ్రహము లన్నింటి పరిమాణము, సూర్యుని పరిమాణముతో పరిపోల్చిన సూర్యునిలో 1/170 వ వంతు కూడ లేవు. నవగ్రహములలో సూర్యమండలమునకు దగ్గరగా నున్న గ్రహములు అనగా బుధుడు, శుక్రుడు, భూమి, అంగారకుడు అను వాటికి ఇకాలోక ఉపగ్రహము లుండును

బుధుడు సూర్యునిచుట్టు నొకసారి తిరుగుటకు సుమారు 88 దినములు పట్టును. అందుచేత అచ్చట సంవత్సరమునకు 88 దినములని చెప్పవచ్చును. బుధుడు భూమికన్న అనేక రెట్లు సూర్యునకు దగ్గరగా నుండుటచే సూర్యునకు భూమ్యాకర్షణశక్తికన్న బుధుని యందెక్కువ ఆకర్షణశక్తి ఎక్కువ. ఈ గ్రహము తనలో తాను తిరుగుచు సూర్యునిచుట్టూ భూమివలె ఒకే వేగ

ముతో నిండియున్నది. ఇచ్చటి వాయుమండలము భయంకరమగు విషవాయువులతో (Poisonous gass) నిండియున్నదని చెప్పుదురు. అచ్చటి ఉష్ణతాపము 350°c పైగా నుండుటచే ఏవిధమగు ప్రాణులను జీవించుటకు అవకాశములు లేవు

సూర్యగ్రహమండలమునకు దగ్గరగానున్న రెండవ గ్రహము శుక్రుడు ఈ గ్రహముయొక్క వ్యాసము సుమారు 8,000 మైళ్లు కలదు. శుక్రగ్రహము, భూమికన్న సూర్యునకు సుమారు రెండుకోట్ల యాభైలక్షల మైళ్లు తక్కువ దూరములో తిరుగుచున్నది శుక్రుడు సూర్యునిచుట్టు ఒకసారి తిరుగుటకు 225 దినములు పట్టును. శాస్త్రజ్ఞులు, పరిశోధకులు, ఈ గ్రహము చూచి పరిశీలింపగా ఇచ్చటనుండు మేఘములు దట్టమైన కటిక చీకటితో నిండి ఎట్టిరకము విషవాయువు లుండునో అవకాశములు లేవని ఊహింపబడినది. బొగ్గుపులుసువాయువు అధికముగా నుండుటచే అచ్చటి ఉష్ణము మరిగెడి నీటికన్న హెచ్చు అనగా సుమారు 180°c ఉండునని ఊహించిరి అచ్చటి వాతావరణముయొక్క దలనము కూడ అధికముగా నుండుటచే అచ్చట రూపాములు వస్తువులు భూమిపైనుండెడివాటికన్న అధికముగా నుండును ఈ గ్రహమునందు ప్రాణి జీవించుటకు అనుకూలమైన వాయువు లెవ్వియు లేనందున ఇచ్చట జీవరాసుల ఉనికికి అవకాశం కనుపించదు

భూమి, సూర్యునినుండి 9 కోట్ల 30 లక్షల మైళ్ల దూరములో గలదు సూర్యుని కాంతి భూమిని చేరుటకు సుమారు 8 నిముషములు పట్టుచున్నది ఈ భూమండలము తనలో తాను తిరుగుచు, 365¼ దినములలో సూర్యునిచుట్టు ప్రత్యేక వ్యాసములో తిరుగుటకు 580,000 000, మైళ్లు ప్రయాణము చేయుచున్నది తనలో తాను తిరుగుటకు 24 గంటలు లేక ఒకదినము పట్టుచున్నది తనలో తాను తిరుగుచు సూర్యునిచుట్టు తిరుగుటవలన రాత్రింబవళ్ళు, ఋతువులు కల్గుచున్నవి భూమండలముయొక్క వ్యాసము సుమారు 8,000 మైళ్ళు కలగు భూమి సూర్యునిచుట్టూ అండాకారముగా (Elliptical way) తిరుగుటచే ఉత్తర దక్షిణ ధ్రువములందు 175 నుండి 180 దినములు తిరుగుగా పగలును రాత్రియు కలుగుచుండును భూమిపై ఉష్ణతాపము 32° F నుండి 125° F వరకుండును. ఇవిగాక ఇచ్చటి వాయుమండలము ప్రాణులు జీవించుటకు అనుకూలమైన వాయువులు, ప్రాణవాయువు, నత్రజని, నీటియావిరి, మున్నగు వాటితో నిండియున్నది భూమండలము చుట్టు చంద్రుడు తిరుగుచున్నాడు

అంగారకగ్రహమునందు ప్రాణి జీవించుటకు కొన్ని అవకాశములు గలవు ఈ గ్రహము భూమికన్న సూర్యునకు ఒకటిన్నర రెట్లు దూరములోనున్నది. అచ్చట దినమునకు 24 గంటల 37 ని నిముషము లుండును అంగారకగ్రహము భూమికన్న పదిరెట్లు తక్కువ బరువుకలిగి సుమారు, 4,230 మైళ్ల వ్యాసము కల్గియున్నది భూమ్యాకర్షణశక్తికన్న ఇచ్చటనుండెడి ఆకర్షణశక్తి చాలా తక్కువని చెప్పుదురు ఈ గ్రహము చుట్టు ఉదజని, హీలియం (Helium) మున్నగు వాయువులు ఆవరించుకొనియున్నవని తెల్పుచున్నారు ప్రాణి జీవించుటకు ముఖ్యాధారము ఉష్ణము అచ్చటి శీతోష్ణస్థితి హిమాలయ పర్వతములపైనుండెడి శీతోష్ణస్థితికన్న చల్లగనుండును దూరదర్శినీయంత్రము (Telescope)ల సహాయమున తీసిన కొన్ని ఛాయాచిత్రములనుండి కొన్ని కాలములందు అంగారక గ్రహమందు కొన్ని ప్రదేశములు ఆకుపచ్చగ నుండి, గోధుమ వర్ణముగా మారుచుండుటచే అచ్చట సస్యవృద్ధి (Vegetation) ఉన్నదని తెలియుచున్నది ఈ గ్రహమందు అధికమైన వృక్షజాతి కూడ కలదని నేటి శాస్త్రజ్ఞులు విశ్వసించుచున్నారు ఈ విషయము మొట్టమొదట నేషనల్ జ్యాగ్రాఫికల్ లోవర్ అబ్జర్వేటరీ పరిశోధకశాలయందు ఇ. సి. స్లిఫర్ కనిపెట్టెను. ఈ పరిశోధకశాలయు దక్షిణాఫ్రికానుండి అనేక పరిశోధనములు గావించుచున్నది

బృహస్పతి అను గ్రహము భూమికన్న 1 800 హెచ్చు వైశాల్యము గల్గియున్నది ఈ గ్రహము చుట్టును ఆరు ఉపగ్రహములు (Satllites) గలవు. వీటిలో 3 ఉపగ్రహములు ఈ గ్రహముయొక్క దిశకు వ్యతిరేకముగా తిరుగుచున్నవి. ఇచ్చట మంచుకన్న అనేకరెట్లు చల్లగా నుండును.

సూర్యునినుండి ఆరవ గ్రహము శని (Saturn). ఈ గ్రహముచుట్టు మూడు వృత్తములు (Rings of Saturn) గలవు ఇవియు చిన్న చిన్న ముక్కలుగా విడిపోవు ఉపగ్రహములని చెప్పవచ్చును ఇవియు గాక ఈ గ్రహమునకు 9 ఉపగ్రహములు గలవు ఈ గ్రహమందు ఉష్ణము మంచుకన్న —150°c తక్కువగా నుండును ఈ గ్రహము చుట్టూ దట్టమైన మంచు అమోనియా (Ammonia) వాయువులతో ఆవరించుకొనియుండుటచే ఇచ్చట ఎట్టిరకపు ప్రాణులు జీవిం

చుట అసంభవము. శనిగ్రహము అన్నిటిలోని కెని గ్రహము తేలికైనదని చెప్పుదురు.

మిగిలిన గ్రహములు వరుణుడు (Uranus), ఇంద్రుడు (Neptune), యముడు (Pluto) భూమికి అనేక కోట్ల మైళ్ళ దూరంలో గలవు. అందుచే ఇవియు నక్షత్రములవలె మన దృష్టికి గోచరించును, గాని కాంతిహీనములు. ఇచ్చట ఉష్ణము మంచుకన్న —225°C తక్కువగా నుండును. వరుణుడు సూర్యునిచుట్టు ఒకసారి తిరుగుటకు 165 సంవత్సరములు పట్టును. అమెరికాదేశపు శాస్త్రజ్ఞుడు యముని 1930 సంవత్సరమున కనిపెట్టెను. భూమి కెట్లొక చంద్రమండలముగలదో వరుణుని చుట్టు నల్గురు ఉపగ్రహములు గలవు. అందులో ఒక దానిని 1947 వ సంవత్సరమున కనిపెట్టిరి. ఇంద్రునకు గూడ ఒక ఉపగ్రహము గలదు.

సూర్యుడు, సూర్యునిచుట్టు తిరుగుచున్న గ్రహములు దేదీప్యమానమైన తేజస్సుతో తిరుగుచున్న నక్షత్రములనుండియే ఉద్భవించినవని చెప్పవచ్చును. సూర్యుడును పూర్వమొక నక్షత్రమే. ఈ నక్షత్రములు గూడ కాంతిహీనమైన సూర్యమండలములని చెప్పవచ్చును. నక్షత్రములు మనకు అపరిమితమైన అసంఖ్యాకమైన దూరములో గలవు. సూర్యమండలముయొక్క వ్యాసము సుమారు 40 కోటమైళ్ళు గలదని చెప్పుదురు. సూర్యమండలమును మన భూమితో సరిపోల్చిన దాని ఆవరణకు సుమారు 10 లక్షల భూమండలములు చాలవు. కాని సూర్యమండలముకన్న అనేక రెట్లు విస్తీర్ణముగల నక్షత్రములుకూడ గలవు. ఓరియాన్ (Orion) అను నక్షత్రవ్యాసము సూర్యుని వ్యాసముకన్న 800 రెట్లు పెద్దదిగానున్నదని చెప్పుదురు అనగా 80 లక్షల సూర్యమండలముల ఆవరణము గలదని చెప్పవచ్చును. హ్యూజ్ (Huge) అను నక్షత్రము 60 లక్షల కోట్లమైళ్ళ వ్యాసము గలదని చెప్పుదురు

నక్షత్రములు మనకు అపరిమితమైనట్టియు, అసంఖ్యాకమైనట్టియు దూరములో గలవని తెల్పియున్నాము. ఇట్టి సంఖ్యను మైళ్లలో ఊహించుట కష్టము. నక్షత్రములకును మనకునుగల దూరమును కాంతిసంవత్సరము (Light year) అను పరిమాణముతో గుర్తించుదురు. వెలుతురు (Light) ఒక లిప్త (Second)కు 186,000 మైళ్ళ దూరము ప్రయాణము చేయగలదు. దీనిని క్రమముగా గుణించిన గంటకు దినమునకు సంవత్సరమునకు ప్రయాణముచేయు దూరము వచ్చును. ఇట్టి సంవత్సరకాలము వెలుతురు ప్రయాణముచేయు దూరమునకే కాంతిసంవత్సర మందురు. ప్రోక్సిమా (Proxima) అను నక్షత్రము మనకు 4 3 కాంతిసంవత్సరముల దూరములో గలదని చెప్పుదురు. పై రెండింటి మధ్యమందు దూరముగూర్చి ఊహించినఎడల సుమారు 25 000 000,000,000 మైళ్ళు గలవు. భూమికి 10 కాంతిసంవత్సరముల దూరములో నున్న నక్షత్రములు చాలా తక్కువ; ప్రక్కపై లెక్కపెట్టవచ్చును. ఉత్తరదిక్కునందు మినుకుమినుకుమని మెరయు ధ్రువ నక్షత్రము (Pole Star) భూమికి 44 కాంతి సంవత్సరముల దూరములో గలదు. అనగా అచ్చటినుండి వెలుతురు మనకండ్లబడుటకు వచ్చుటకు 44 సంవత్సరముల క్రిందటే బయలుదేరి యుండవలెనని చెప్పవచ్చును. ఇదిగాక దూర దూరాంతములలో గల నక్షత్రములు, శక్తివంతమైన దూరదర్శనీయంత్రసహాయముతో చూచిన కనిపించును. ఈ నక్షత్రరాశిలోని కొన్నింటి కాంతి భూమిమీద పడుటకు అనేక కోట్ల సంవత్సరములు పట్టును. విశ్వముగూర్చి ఈ ఊహ విభ్రాంతిని కలుగజేయును. ఈ మహావిశ్వంలో ఈ భూగోళమెంత? ఈ భూమిపై జీవించే మానవుడెంత? కాని మానవుని ఉనికి స్వల్పమైనదైనా, మానసికంగా గొప్పది.

నేటి అణుయుగమందు, అంగారకగ్రహాన్ని, చంద్రుని చేరుటకు, విశ్వాంతరయానము సాగించుటకు విశ్వప్రయత్నములు చేయుచున్నటు మనము పత్రికల ద్వారా వినుచున్నాము. ఉన్నట్లుండి రష్యనులు గత అక్టోబరు 4 వ తేదీని ఒక కృత్రిమ గ్రహము (Satellite)ను తయారుచేసి విశ్వాంతరంలోనికి విసరివేసిరి. ఈ కృత్రిమగ్రహం మరియొక చంద్రమండలమువలె భూమిచుటూ తిరుగుట నిఖిలప్రపంచాన్ని ఆశ్చర్యములను చేసినది. విశ్వవిజయానికి ఇది మానవుడు విజయవంతంగా చేసిన తొలిప్రయత్నము. ఇదిగాక రష్యను విజ్ఞానశాస్త్ర పరిశోధకులు గత నవంబరు 3 వ తేదీ ఉదయం 11-45 నిముషములకు మరియొక కృత్రిమ గ్రహమును తయారుచేసి అందులో ఒకకుక్కను ఉంచి గగనమార్గంపైకి పంపివేసిరి. దీనివలన విశ్వాంతరయానమునకు గల అవకాశములనుగూర్చి ప్రపంచమంతా అత్యుత్సాహముతో వేచియున్నది. తరువాత అమెరికనులు గూడ మరియొక గ్రహాన్ని విజయవంతంగా వదలిపెట్టిరి. ఉభయులూ విశ్వాంతరంలోని గ్రహములను చేరుకొనుటకు తీవ్రమైన ప్రయత్నములు సాగిస్తున్నారు. ఇది ఎంతైన ఆశ్చర్యకరమయిన విషయము.

మానవుడు ఒకానొకప్పుడు ఈ గ్రహములకే గాక నక్షత్రములనుగూడ జయించబోవునని చెప్పుటలో అతిశయోక్తి లేదు.

టలో సందేహ ముండజాలదు. కారణమేమన విష్ణుకుండినుల తామ్రశాసనములందు మనకు 'కేసరి' ముద్రను గాంచగలము. ఈ విష్ణుకుండినులు పరిపాలించిన ప్రాంతమందు దొరికిన నాణెములమీద కూడ ఒక వైపు పూలకుండీ బొమ్మ, రెండవవైపున పంజా పైకి ఎత్తి తోకలు ఉవ్వెత్తుగా పైకి లేపియున్న సింహపు బొమ్మ కాంచగలము. ఈ నాణెములు బంగారు, వెండి లోహముతో చేయబడియున్నవి. ఈ నాణెములను ఎక్కువగా ఉత్తర సర్కారు జిల్లాలలో కమీషనరుగా పనిచేసిన సర్ వాల్టర్ ఇలియట్ (Sir Walter Elliot) సంపాదించెను.

సర్ వాల్టర్ ఇలియట్, ప్రొఫెసర్ రాప్సన్ మొదలగువారు ఆ నాణెములు పల్లవరాజులకు చెందినవని తప్పుగా సిద్ధాంతీకరించియున్నారు. వీరి సిద్ధాంతములు తప్పుగా పేర్కొనడానికి తగినంత ఆధారము కలదు 1 ఈ నాణెములమీద నున్న సింహము పూలకుండీ, శంఖము మొదలగు ముద్రలన్నియు ఈ శిలాలయములకు సంబంధించినవై యున్నవి 2 విష్ణుకుండిన రాజుల తామ్రశాసనములమీద కేసరిముద్రలు ఉన్నవి 3 వీరు ఈ సిద్ధాంతము చేసియున్న కాలమునకు విష్ణుకుండినులను రాజవంశము ఆంధ్రదేశమును పరిపాలించిన దను విషయము చరిత్రకారులకు తెలిసియుండలేదు. 4 ఈ నాణెములు ఎక్కువగా విష్ణుకుండినులు పరిపాలించిన ఉత్తరసర్కారు జిల్లాలనుండి లభించినవి

పై నుదహరించిన కారణములనుండు ముఖ్యముగా గమనింపదగినవిషయము వారు ఈ నిర్ణయము చేసిన కాలమునాటికి ఆంధ్రదేశమును పాలించిన రాజుల వంశక్రమము నిర్ణయింపబడి యుండలేదు. మరియొక కారణ మేమనగా వీరికి లభించిన నాణెములయందు ఒక నాణెముమీద పూలకుండీ, సింహము ముద్రలేకాక, 'శ్రీపర్వత' యను అక్షరములుకూడ నున్నవి విష్ణుకుండినరాజులు "శ్రీపర్వతస్వామి"ని ఆరాధించియున్నారని తెలియుచున్నది

ఉండవల్లి గుహాలయందు ఒక గోడమీద రెండు మాటలలో 7 అక్షరముల పేరు ఒకటి చెక్కబడియున్నది. ఆ అక్షరములు "శ్రీ ఉత్పత్తి పిడుగు" అను పేరు ముందరి వాలులో కానవచ్చుచున్నది ఇంకొక విచిత్ర మేమనగా ఈ పేరే విజయవాడ ఇంద్రకీలాద్రి పర్వతముపైనున్న "అక్కన్న—మాదన్న" గుహాలయ ద్వితీయ శ్రేణియందున్న స్తంభములపైన (Supporting walls) మీదకూడనున్నది. ఈ విషయము ఆర్కియాలజికల్ డిపార్టుమెంటు (Archaeological Department) వారు కూడా చూచినట్లు కనబడుటలేదు.*

పై నుదహరించిన వాస్తవములను పరిశీలించిన యెడల ఈ శిలాలయములు లలితకళల కెక్కువగా ఆదరించిన విష్ణుకుండిన రాజవంశీయులచే నిర్మింపబడె. యుండునని యనుటలో సందేహ మిసుమంతయు లేదని

* ఈ పేరు ఈ గుహాలు నిర్మించిన, నిర్మింప జేసినవారిలో ఎవరిదో తెలియదు.

ఆరంభంలో సాహిత్య గ్రంథాల పోటీలో భారత ప్రభుత్వం బహుమతి లభించింది

దీనిలో గ్రంథకర్త పాలకొల్లు నరసాపురం ప్రాంతాలలో అల్లికలమగ్గించి, ఏలూరు దగ్గర కంబళ్ళ నేతను గురించి, కొండపల్లి బొమ్మలు, బందరు కలంకారీ అద్దకాలు మొదలైన ఆంధ్రదేశంలోని ప్రసిద్ధ మయిన కొన్ని కుటీర పరిశ్రమలను గురించీ సంగ్రహంగా వివరించారు ఆయా కుటీరపరిశ్రమల వివరణలో చేర్చిన ఛాయాచిత్రాలు ఆయా పరిశ్రమల స్వరూప స్వభావాలు అవగాహన చేసుకోవడానికి బాగా సహకరిస్తున్నాయి

శ్రీ సత్యనారాయణగారి గ్రంథంలో విదేశాలలోను, ఇతర రాష్ట్రాలలోను ప్రసిద్ధికెక్కిన మన ఆంధ్రదేశపు కుటీర పరిశ్రమలను గురించి మాత్రమే సంగ్రహంగా వివరించారు

వీరి గ్రంథం ముగించగానే అంతగా ప్రసిద్ధి పొందని కుటీరపరిశ్రమలు తెలిసికొన్న మన గ్రామసీమలలో భాగాలలో ఉన్నాయని స్ఫురిస్తుంది కొబ్బరి పీచు మొదలైనవి చేసే తాళ్లు తయారుచేయ్యడం ఈజాతి పరిశ్రమలకిందికే వస్తుంది ఇలాగే ఆయా గ్రామాలలో కంచు పాత్రలు పోతపోసేవారు, ఇత్తడిసామానులు తయారుచేసే కుటీరపారిశ్రామికులు, ఇంకా ఇతర కుటీర పారిశ్రామికులు ఎందరెందరో ఉన్నారు

ఈ పారిశ్రామికుల ఆర్థికమయిన స్థితిగతులు వారికి కావలసిన ముడిపదార్థాల సరఫరా, రవాణా సౌకర్యాల ఏర్పాట్లు మొదలైనవి జాగ్రత్తగా ఏర్పాటు చెయ్యగలిగిన అవసరం చాలా ఉన్నది ఇటువంటి కుటీర పారిశ్రామికులందరూ కొద్దో గొప్పో ప్రతిపల్లె లోను కనిపిస్తున్నారు ఆయా పరిశ్రమలలో వీరికి ప్రత్యేకంగా పేరు ప్రసిద్ధివచ్చి ఉండకపోవచ్చును ప్రసిద్ధిపొందిన కుటీర పారిశ్రామికుల సంఖ్యకన్నా వీరి సంఖ్య పెద్ది ప్రసిద్ధిపొందినవారి పరిస్థితులే అంతంతగా ఉన్నప్పుడు వీరిమాట వేరె చెప్పనక్కరలేదు.



ఈ గ్రంథంలో సమగ్రంగా ఆర్థికాది విషయ దృక్పథాలతోను ఆంధ్రదేశపు కుటీరపరిశ్రమలను గురించి చర్చించి ఉంటే ఈ పుస్తకం మరింత ఉపయుక్తంగా ఉండేది ఏది ఏమైనా మన దేశంలో బాగా ప్రసిద్ధికెక్కిన కుటీరపరిశ్రమలనుగూర్చి సంగ్రహంగా పరిచయం సంపాదించుకోడానికి మాత్రమే ఈ చిన్న గ్రంథం ఉపయోగించగలదు 'శాస్త్రి'

## ప్రణతి

శ్రీ కవిరాజమూర్తి ప్రతులకు ప్రజాసాహిత్య పరిషత్తు, ఖమ్మంమెట్టు. వెల ఒక రూపాయి.

ఇది ఎరమేశ్వరరావుగూర్చి స్వేచ్ఛా పద్య ఛందస్సులో రచించిన కావ్యం విప్లవమైన భావాలతో పరిశంగా సాగిన రచన ఈ కావ్యంలో అంతటా ప్రతిధ్వనిస్తున్నది

"ఆయాచాపల్య వీధిలో
సాధువుల సభ్యతవలె
ధనికాంపిక వ్యాపారంలో
ప్రేమ దయాపరవలె
మృత్యువు ఆగమనంలో
చెదిరే కాయంవలె
వాలోనే ఇమిడిఉన్న
పరరూప పు దానవుండు
నీ ఉనికిని మాపె నీకు
నీ మరం తెలుపనీదు"

## శ్రీ కృష్ణదేవరాయలు

శ్రీ వి రామకృష్ణరావు టీచరు, జయహింద్ కొలంపెరీ స్కూల్, మచిలీపట్నం వెల రూపాయి.

ప్రాచీన సంప్రదాయ ధోరణిలో గద్య పద్యాత్మకంగా రచించిన రూపకం అక్కడక్కడ రచయిత ఈ రూపకంలో పాటలుకూడా చేర్చారు.

## వీరాంబ

శ్రీ ఆర్ వెంకటేశ్వర్లు, పెదకళ్లేపల్లి వెల: అర్ధరూపాయి

ఉయ్యూరులో గ్రామదేవత వీరమ్మను గురించి ప్రజలలో అనుశ్రుతంగా వినవస్తున్న గాథతో రచించిన గద్యరచన రచయిత ఈ చరిత్ర అంతా ఒక కథగా సులభశైలిలో రచించారు

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor. S. Sambhu Prasad.